DL
319
Acc No
20666

చీకట్లో చిరుదివ్వెలు

# 101 స్వయం ఉపాధి పధకాలు
# (SELF-EMPLOYMENT SCHEMES)

1999

రచన :
డా॥ వి.వి. బాలకృష్ణ, M.Sc., Ph.D ,
(1990వ సం॥ ఆంధ్రప్రదేశ్ వయోజన విద్యాశాఖవారి
ఉత్తమ రచయిత బహుమతి గ్రహీత)

నవరత్న బుక్ సెంటర్
పబ్లిషర్స్ * బుక్ డిస్ట్రిబ్యూటర్స్
కారల్‌మార్క్స్ రోడ్ * విజయవాడ - 2.

చీకట్లో చిరుదివ్వెలు

# 101 స్వయం ఉపాధి పథకాలు

ప్రథమ ముద్రణ :
డిశంబర్ : 1998

ముఖచిత్రం :
ఎ. రవిబాబు

ప్రచురణ హక్కులు :
బి.కె ఆర్. మూర్తి (పబ్లిషర్)
విజయవాడ-2, ఫోన్ : 432813

ప్రింటర్స్ :
ప్లానోగ్రాఫర్స్ ఆఫ్ సెట్ ప్రింటర్స్
గాంధీనగర్, విజయవాడ-3.

**వెల : రూ. 50-00**

# విషయ సూచిక

## మొదటి భాగం - స్వయం ఉపాధి పథకాలు-పూర్వాపరాలు



## రెండవ భాగం - స్వయం ఉపాధి పథకాలు: స్కీముల వివరాలు

7. ఆదాయాన్నిచ్చే పట్టు పరిశ్రమ
8. పౌష్టికాహారం ప్రసాదించే కోళ్ళపరిశ్రమ
9. కోళ్లదాణా, పశువులదాణా (మేత)
10. నూనెమిల్లు.

## 2. ఆహార పదార్థాలు

11. బ్రెడ్
12. అలూచిప్స్
13. సోయానగట్స్
14. పుట్టగొడుగులు(మష్‌రూమ్)
15. ఫిష్‌పికిల్ (చేపల ఊరగాయ)
16. డెయిరీసాల్ట్
17. షుగర్ క్యాండీ, టాఫీస్(మిఠాయిలు)
18. సోడా, కూల్‌డ్రింక్స్
19. ఐస్‌ప్లాంట్

## 3. ఆటోమొబైల్, ఇంజనీరింగ్

20. ఆటోమొబైల్ సైలెన్సర్
21. ఇంధనం కొలతలు చూపే ఫ్యూయల్ మీటర్
22. పాత టైరుకు కొత్త జీవం పోసే టైర్ల రీట్రేడింగ్
23. వాహనాలకు ప్రాణం-స్టోరేజి బ్యాటరీ సర్వీసింగ్
24. ట్రాన్స్‌ఫార్మర్ సర్వీసింగ్ & రిపేరింగ్
25. ఎలక్ట్రికల్ మోటార్ స్టాంపింగ్

## 4. అన్ని అవసరాలకు పనికొచ్చే ఇనుము, అల్యూమినియం వగైరా వస్తువులు

26. అల్మైరాలు
27. స్టీలు అల్మైరాలు, ఐరన్‌ర్యాక్‌లు
28. మూతలేని ఐరన్‌ర్యాక్‌లు
29. అందరికీ అవసరమైన స్టీల్ ఫర్నిచర్ (టేబుల్స్)
30. ఇళ్లకు అలంకారం - స్టీల్ విండోస్, డోర్స్
31. దుకాణాలు మూసే రోలింగ్ షట్టర్స్
32. డోర్‌ఫ్రేమ్‌లు వగైరాల ఫాబ్రికేషన్ (రూపకల్పన)

33. గచ్చుమోసేందుకు పనికొచ్చే గమేళాలు (మోర్టార్ పాన్స్)
34. ఇళ్ళు కట్టడానికి అవసరమైన సెంట్రింగ్ షీట్స్
35. స్టీలు పాత్రలు
36. ఎన్నో అవసరాలకు పనికొచ్చే స్టీలు డ్రమ్ములు, డస్ట్‌బిన్‌లు
37. లగేజి కారియర్‌లు
38. సామాన్లు భద్రపరిచే పెట్టెలు
39. ఇళ్లలో వాడుకునే ఇనుపబకెట్‌లు (జి.ఐ. బకెట్‌లు)
40. సామాన్యులకు వరప్రసాదం వత్తుల స్టౌ
41. పి.వి.సి. రిజిడ్ పైపులు
42. పి.వి.సి. పైప్ ఫీటింగులు
43. అల్యూమినియం గొట్టాలు.
44. తుక్కునుంచి తయారయ్యే అల్యూమినియం పాత్రలు
45. మన్నికకోసం అంతావాడే అల్యూమినియం పాత్రలు
46. కావలసినప్పుడు వేడినీళ్లకోసం అల్యూమినియం వాటర్‌హీటర్
47. వంటకు, ఇతర అవసరాలకు పనికొచ్చే ఇత్తడిపాత్రలు
48. యంత్రపరికరాల విడిభాగాల కోసం నాన్‌ఫెర్రస్ ఫౌండ్రీ
49. మధ్యతరగతివారికే మేలుచేసే సైకిళ్ల అసెంబ్లీ
50. సైకిల్ విడిభాగాలు-సైకిల్ కారియర్‌లు, స్టాండ్‌లు

## 5. రసాయనాలు-సంబంధిత పరిశ్రమలు

51. రసాయన పరీక్షలు చేసేందుకు మినీ లేబరేటరీ
52. పరిశ్రమలకు అవసరమైన నీరు కలిపినసున్నం (హైడ్రేటెడ్ లైమ్)
53. చవకైన ఇళ్లకోసం వాడే డ్రైడిస్‌టెంపర్
54. సిరమిక్ పరిశ్రమల్లో పనికొచ్చే ఫెల్డ్‌స్పార్ పల్వరైజింగ్
55. పాలిష్ బండల పరిశ్రమ -స్టోన్‌పాలిషింగ్
56. ఇంటి అలంకరణలకు పనికొచ్చే గ్రానైట్ టైల్స్
57. కట్టడాలకు పనికొచ్చే సిమెంటు బ్లాక్‌లు
58. మందులు, మాత్రలు వగైరా తయారుచేసే ఫార్మాస్యూటికల్ ఫార్ములేషన్స్
59. మందుల తయారీలో పనికొచ్చే సల్ఫ్యూరిక్ ఆమ్లం.
60. పాత్రలు వగైరాలు శుభ్రంచేసే క్లీనింగ్ పౌడర్
61. ఇళ్లలో, గుళ్లలో వాడే కర్పూరం
62. పరిమళాలు వెదజల్లే అగరుబత్తి

63. ఎలక్ట్రానిక్స్ పరిశ్రమలకు అవసరం-ప్రింటెడ్ సర్క్యూట్ బోర్డ్ల అసెంబ్లీ
64. వస్తువులకు మెరుపునిచ్చే ఎలెక్ట్రోస్టాటిక్ పౌడర్ కోట
65. వస్తువులకు ఆకర్షణనిచ్చే ఎలెక్ట్రో ప్లేటింగ్ (విద్యుత్ మలామా)
66. వినోదాన్ని అందించే వీడియో క్యాసెట్ డూప్లికేషన్ (రికార్డింగ్)
67. అందరూ కోరుకునే ప్లాస్టిక్ వస్తువుల తయారీ (థర్మోప్లాస్టిక్ ఇంజక్షన్ మౌల్డింగ్)
68. దుస్తులకోసం కావలసిన గుండీలు (ఫార్మాల్డిహైడ్ బటన్‌లు)
69. గడియారాల గీతలు పోగొట్టే వాచ్ కేసుల పాలిషింగ్
70. హోటల్స్ వగైరాలకు అవసరమయ్యే టాయ్‌లెట్ రోల్స్, పేపర్ నాప్‌కిన్‌లు
71. ప్యాకింగ్ మెటీరియల్ (ప్లాస్టిక్ సంచులు వగైరా)
72. వాడి పారేయగల పాత్రలు (యూస్ అండ్ త్రో కంటెయినర్స్)
73. తేలికగా, ధృఢంగా వుండే ఫైబర్‌గ్లాస్ వస్తువులు

## *6.* విద్యుత్ పరికరాలు

74. ట్యూబ్‌లైట్ స్టాండ్‌లు
75. ట్యూబ్‌లైట్ పట్టీలు
76. ఎలక్ట్రికల్ వైర్ క్లిప్పింగ్‌లు

## *7.* కొన్ని దుకాణాలు

77. అల్యూమినియం పాత్రల దుకాణం
78. ఇనుపసామాన్ల దుకాణం
79. చెప్పుల షాపు
80. గ్రామాలలో అవసరాలకోసం గాజుల దుకాణం(ఫ్యాన్సీ షాపు)
81. పుస్తకాల దుకాణం (బుక్ షాపు)
82. కొయ్యపని దుకాణం (వడ్రంగం యూనిట్)
83. ఫ్రిజ్ రిపేర్ షాప్
84. ఆటోమొబైల్ షాపు
85. ఇతర పరిశ్రమల పెయింటింగ్ అవసరాలకు పెయింటింగ్, టింకరింగ్ షాపు
86. జనరల్ ఇంజనీరింగ్ వర్క్‌షాప్

## *8.* ఆఫీసు ఫ్యాన్సీ వస్తువులు

87. కవర్‌లు
88. పేపర్ ఎన్వెలప్స్

89. పెన్సిళ్లు
90. పెన్సిల్ షార్ప్‌నర్
91. పాలిథిన్ షీట్
92. జెమ్‌క్లిప్స్
93. రబ్బర్ బ్యాండ్స్
94. మహిళలువాడే హెయిర్‌పిన్స్, క్లిప్స్
95. ఆడవాళ్లను ఆకర్షించే లెదర్‌పర్సులు, హేండ్‌బ్యాగ్‌లు
96. రెడీమేడ్ దుస్తులు
97. గొడుగుల తయారీ

## 9. కొన్ని ఇతరవృత్తులు

98. రంగులలోకం చూపించే ఫోటోగ్రఫీ-కలర్‌ఫోటో ప్రాసెసింగ్
99. ప్యాకింగ్ సంచులపై ముద్రణకోసం వాడే రోటోగ్రావ్యూర్ ప్రింటింగ్
100. ఇన్విటేషన్‌లు వగైరాలు తయారుచేసే స్క్రీన్‌ప్రింటింగ్
101. చీరెలకు రంగువేసేందుకు స్క్రీన్‌ప్రింటింగ్, డైయింగ్

## మూడవభాగం

## అనుబంధం (ముఖ్య పరిశ్రమల జాబితాలు)

1. ఖాదీ గ్రామీణ పరిశ్రమల జాబితా
2. చిన్నపరిశ్రమల జాబితా
3. స్టేట్ ఫైనాన్సియల్ కార్పొరేషన్ ఇతరస్కీములు
4. సింగిల్ విండో పథకం
5. గ్రామోదయ పథకం
6. ట్రైసెమ్ పథకం
7. డి.ఆర్.డి.ఎ పథకాలు
8. నాబార్డ్ పరిశ్రమలు
9. స్త్రీలకు ముఖ్య పరిశ్రమలు

## మొదటిభాగం

# స్వయం ఉపాధి పథకాలు - పూర్వాపరాలు

## 1. పరిచయం

ఈనాడు మనదేశం క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొంటూ వుంది. తీవ్రవాదులు అనేక సమస్యలను సృష్టిస్తున్నారు. ఎటు చూసినా అలజడి, ఆందోళన పెరిగిపోతున్నాయి. దేశం అట్టుడికి పోతూంది. గృహదహనాలు, లూఠీలు, సమ్మెలు, మానభంగాలు, రైలుదోపిడీలు, బస్సుదోపిడీలు, హత్యలు - ఇలా అనేక రకాలుగా దౌర్జన్యం రాజ్యమేలుతూంది. ఇందులో ఎక్కువగా యువత పాల్గొనడం గమనించదగ్గ విషయం. ఇందుకు కారణం ఏమిటి? మన సమస్యలు చాలా వాటికి అధిక జనాభా, నిరుద్యోగం కారణాలు. నిరక్షరాస్యత మూలంగా జనాభా సమస్య మన చేతులు దాటి పోయే స్థితికి చేరుకుంది. ఉద్యోగాలు రానప్పుడు చదువెందుకు అనే నిరాశ యువతను కుంగదీస్తుంది. ఈ అంధకారంలో మళ్లీ కాంతులు నింపే ఆశాజ్యోతులే స్వయం ఉపాధి పథకాలు.

ప్రస్తుతం ఈ పథకాలకు ఎన్నోవిధాలుగా ప్రోత్సాహం లభిస్తుంది. ప్రభుత్వ స్థాయిలో ఎన్నో సంస్థలు ఇందుకోసం ఏర్పడ్డాయి. ఏం చేయాలి? ఎలా చేయాలి? అన్నిటికీ డబ్బు ఎవరిస్తారు? మొదలైన ప్రశ్నలకు సమాధానాలు వచ్చాయి. పలురకాల చిన్న పరిశ్రమలను ప్రభుత్వం సూచించింది. వీటికి ఎంత పెట్టుబడి కావాలి? దీనిని ఎలా పొందవచ్చు అనే సందేహాలకు ప్రభుత్వమే సమాధానం ఇస్తోంది. అదే విధంగా పరిశ్రమ స్థాపించిన తర్వాత ఏ విధంగా నిర్వహించాలో కూడా శిక్షణా శిబిరాల ద్వారా తెలియజేస్తుంది. అందుచేత ఈ దేశం నాకేమిచ్చింది అనే ప్రశ్న వేయ తావులేదు. ఈ దేశం మనకెంతో ఇచ్చేందుకు సిద్ధంగా వుంది. మనమే తీసుకునేందుకు సిద్ధంగా లేము.

స్వయం ఉపాధి కల్పన కోసం ప్రయత్నించ దగ్గ 101 పథకాలు మీకోసం సేకరించి ఈ రూపంలో అందించడం జరిగింది. ఇది కేవలం నేపథ్యసహకారం మాత్రమే. ఔత్సాహికులు దీని నుంచి ప్రేరణ పొంది సంబంధిత ప్రభుత్వ అధికారులను, బ్యాంకులను సంప్రదించి తాజా సమాచారం ఎప్పటి కప్పుడు తెలుసుకోమని మనవి.

ఈ స్వయం **ఉపాధి** పథకాలు ఎవరైనా ప్రారంభించవచ్చు. పెద్దపెద్ద చదువులు, గొప్ప డిగ్రీలు అవసరం లేదు. కావలసినది తాము చేపట్టే పథకం ముందు వెనకలు తెలుసుకోవడం. అందరితో మంచిగా వుండి ధైర్యంగా ముందుకు సాగటం. ఏ పథకం అనుకున్నా ముందుగా మనం తయారు చేసే వస్తువుకు మార్కెట్‌లో గిరాకీ వుందా లేదా తెలుసుకోవాలి. పోటీ ఎంత

వుంది? దానిని ఎలా ఎదుర్కోవాలి అనే విషయాలు ఆలోచించాలి. అంద రికీ అవసరమైన వస్తువులు సాధ్యమైనంతగా అందించగలిగితే ఇక తిరుగులేదు. అలాగే పథకాన్ని చేపట్టి నిర్వహించేందుకు పాటించవలసిన నియమనిబంధనలు, జాగ్రత్తలు, ప్రభుత్వం అందించే సహాయం, మనం చేయవలసిన పనులు మొదలైన విషయాలను శ్రద్ధగా గమనిస్తే అడ్డుఅపు వుండవు. మన బండి హైవేలో వెళ్తున్నట్లే. ఈ పుస్తకం అందరికీ ఈ దిశగా మార్గదర్శి కావాలని ఆశిస్తున్నాను.

## 2. ఇంతకీ స్వయం ఉపాధి పథకాలు అంటే?

మనలో చాలామందికి చదువు పూర్తి కాగానే ఓ చిన్న ఉద్యోగం దొరికితే చాలు అనుకుంటారు. నానా తిప్పలూ పడి ఉద్యోగం సంపాదించాక వచ్చే జీతం చాలక నిరాశకు లోనవుతారు. తమ శక్తి సామర్థ్యాలతో తమ కాళ్ళపై తాము నిలబడవచ్చుకదా అని ఆలోచించరు. ప్రభుత్వం అందరికీ ఉద్యోగాలు ఇవ్వడం అసంభవం. అందువల్ల చదువుకుని, కొద్దో గొప్పో పెట్టుబడి పెట్టగల వారికి తమకు తాము ఉపాధి కల్పించుకునేందుకు ఏర్పడినవే స్వయంఉపాధి పథకాలు. వీటివల్ల జీవించు-ఇతరులను జీవించనివ్వు అనే సూక్తికి న్యాయం చేకూరుతుంది. మనతోపాటు పదిమంది బతికే అవకాశాలు ఏర్పడతాయి. ఈ పథకాలు ఎన్నోరకాలు. వీటిలో ఎన్నిటినో గ్రామాలలో నిర్వహించవచ్చు. వ్యవసాయపనులు అంతగా లేని కాలంలోనూ, వ్యవసాయం వున్నప్పుడు వేణ్నీళ్లకు చన్నీళ్లుగానూ ఈ పథకాలు ఆదుకుంటాయి.

ఈ పథకాల గురించిన వివరాలు ముందు పేజీలలో తెలుసుకుంటారు.

## 3. స్వయం ఉపాధి రంగంలో వెలుగుకిరణాలు

గతంలో ఆంధ్రజ్యోతి వారపత్రికలో వచ్చిన 'త్రినేత్రుడు' సీరియల్ నవల చాలామందికి పరిచయం ఉండి వుంటుంది. ఆనవలలో రచయిత శ్రీ సూర్యదేవర రామ్మోహనరావ్‌గారు స్వశక్తితో పైకి వచ్చిన ప్రముఖుల గురించి ఆసక్తికరమైన విశేషాలు తెలియజేశారు. అప్పుడప్పుడు ఇతర పత్రికలు కూడా ఇటువంటి ప్రముఖుల పరిచయాలు రాశాయి. ఆవిధంగా వచ్చిన విశేషాలు పాఠకుల సౌకర్యం కోసం సేకరించి ఇక్కడ క్లుప్తంగా ఇవ్వడం జరిగింది. ఈ విజయ గాథలు స్వయం ఉపాధి పథకాలు చేపట్టాలనుకునేవారికి ఆశాజ్యోతులవంటివి. వెలుగుకిరణాల వంటివి.

**1. లిజ్జత్ పాపడ్ సంస్థ :** ఈనాడు లిజ్జత్‌పాపడ్ ఇంటింటా మార్మోగుతున్న పేరు. అప్పడాల తయారీలో ఎన్నికైన పేరు. ఈ సంస్థ గొప్పదనం ఏమిటంటే అంతా మహిళలే ఆత్మవిశ్వాసంతో కష్టపడి పనిచేయడం మహిళాశక్తికి గొప్ప ఉదాహరణ ఈ సంస్థ. శ్రీ మహిళాగృహ ఉద్యోగ్ సంస్థ శ్రీ

మహిళా కుటీరపరిశ్రమల సంస్థ వారు దీనిని నిర్వహిస్తున్నారు. వీరి కేంద్రస్థానం బొంబాయి. 1974లో వీరి శాఖ హైదరాబాద్‌లో ప్రారంభమైంది. కేవలం మహిళల కోసం మహిళలే నిర్వహించే ఈసంస్థ స్త్రీ శక్తిపాటవాన్ని చాటి చెబుతూంది. మామూలు అప్పడాలు, పంజాబీ మసాలా, ఉదద్ (ఉద్దివప్పు) అప్పడాలు, వేరుశనగపప్పు (మూంగ్), వెల్లుల్లి, మిర్చి, జీరా (జీలకర్ర) అప్ప డాలు మొదలైనవి వీరు తయారుచేసే అప్పడాలలో కొన్నిరకాలు. మొదట అయిదుగురితో మొదలైన ఈ సంస్థలో ఈనాడు 350 మందికిపైగా వున్నారు. హైదరాబాద్ సంస్థ డైరెక్టర్ జయప్రదగారు 45 సం.ల మహిళ. క్రమశిక్షణ, ఆత్మీయతలతో ఎటువంటి అరమరికలు లేకుండా అంతా కలిసి పని చేయడం వీరి ప్రత్యేకత. దేశం మొత్తం మీద లిజ్జత్ పాపడ్‌కు 31 శాఖలున్నాయి. దక్షిణ భారతదేశంలో హైదరాబాద్ శాఖ మొదటిది. తర్వాత బెంగుళూరు, మద్రాసులలో ఏర్పడ్డాయి. ప్రస్తుతం హైదరాబాద్‌లోని రామాంతపూర్‌లో వీరు **ససా అనే** డిటర్జెంట్ ఉతికే **బిళ్లను** కూడా తయారు చేస్తున్నారు. ఇందు **లోనూ** అంతా మహిళలే కావడం గమనార్హం.

**2. త్రివేణి వక్కపొడి :** ఎన్నో వక్కపొడులు బజారులో దొరుకుతున్నా,తన ప్రత్యేకత నిలుపుకుంది త్రివేణి. దీని వ్యవస్థాపకులు దేసు వెంకట సుబ్బారావ్ గారు. చిన్నతనంలో భోగభాగ్యాలు అనుభవించి నమ్మినవాళ్ల నమ్మకద్రోహం వల్ల వారి కుటుంబం చితికిపోయింది. తండ్రి పడుతున్న ఇబ్బంది చూడలేక సుబ్బారావ్‌గారు చదువు మానేసి, ఒకరైస్‌మిల్‌లో నెలకు 30 రూపాయల జీతం వచ్చే ఉగ్యోగంలో చేరారు. కాలం గడిచే కొద్దీ ఉద్యోగం అయనకు తృప్తి నివ్వలేదు. 1947-48 ప్రాంతంలో చాలామంది వక్కపొడి వ్యాపారం చేయడం చూశారు. తానూ అదే వ్యాపారం చేయాలనుకున్నారు. అయనకు పెట్టుబడి ఇచ్చేందుకు ఎవరూ ముందుకు రాలేదు. ఈనాడున్నంత బ్యాంక్ రుణాలు అనాడు లేవు మరి! అయన శ్రీమతి ఇచ్చిన గొలుసు అమ్మి ఆ వెయ్యిరూపాయలతో వ్యాపారం మొదలుపెట్టారు. త్రివేణి వక్కపొడి మార్కెట్ లోకి వచ్చింది. తీవ్రమైన పోటీని ఎదుర్కొన్నా అయన చలించలేదు. 1959 నాటికి మంచి ప్రగతిని సాధించారు. ఆటోమాటిక్ ఫిల్లింగ్, ప్యాకింగ్ మెషిన్స్ వాడడం మొదలు పెట్టారు. తర్వాత అగ్గిపెట్టెల పరిశ్రమ స్థాపించి అందులో రికార్డు సృష్టించారు. ఆంధ్రాఉద్యమ సమయంలో ముడి పదార్థాల కొరతవల్ల దానికి అవరోధం ఏర్పడింది. అప్పుడు ఆ వ్యాపారం మానేశారు. తర్వాత రాష్ట్ర ఆర్థిక సంస్థ (స్టేట్ ఫైనాన్సియల్ కార్పొరేషన్) సహాయంతో తైవాన్ నుంచి లక్షల ఖరీదు చేసే యంత్రాలు తెప్పించి త్రివేణిని ఆధునీకరించారు. ఈవిధంగా అతి తక్కువస్థాయి నుంచి అందరూ అసూయపడే స్థాయికి ఎదిగిన సుబ్బారావ్‌గారు అందరికీ ఆదర్శం కావాలి.

**3. టి.టి.కె :** ప్రెస్టీజ్ ప్రెషర్ కుక్కర్ వంటింట్లో విప్లవం తెచ్చిన

పరికరం. దానిని విస్తృతంగా అమ్మిన సంస్థ టి.టి.కె. ఈనాడు టి.టి.కృష్ణమాచారి సంస్థ అందరి నోట్లో నానుతున్న పేరు. 1928లో మద్రాసులో ఒక చిన్న గదిలో ప్రారంభం అయిన ఈ సంస్థ ఈనాడు ఎన్నో అంతస్తులు ఎదిగింది. కృష్ణమాచారిగారు స్వతంత్రపోరాటం సమయంలో నెహ్రూప్రభావానికి గురైనప్పుడు వ్యాపారం వారి అబ్బాయి నరసింహన్ చేతికి వచ్చింది. అప్పటినుంచి నరసింహన్ రాత్రింబవళ్లు కష్టపడి వ్యాపారాన్ని పెంచారు. ఎన్నో కంపెనీలవారు తమ ఉత్పత్తులను మార్కెట్ చేసేందుకు నరసింహన్‌గారిపై ఆధారపడ్డారు. కృష్ణమాచారిగారు తర్వాత నెహ్రూగారి మంత్రివర్గంలో సభ్యులైనారు. నరసింహన్ డీలర్‌షిప్ వదిలి ఉత్పత్తులవైపు దృష్టి మరల్చారు. వినియోగదారులకు అవసరమైన వస్తువులను తయారుచేయాలని అనుకున్నారు. వంటింట్లో తన భార్య పడే అవస్థలు ఆయనను ప్రెషర్‌కుక్కర్ వైపు తీసుకెళ్లాయి. ప్రెస్టీజ్ కంపెనీ సహకారంతో కుక్కర్ తయారుచేశారు. ఈనాడు టి.టి.కె ఎన్నో వస్తువులను అమ్ముతుంది. టూత్‌బ్రష్, షేవింగ్‌క్రీమ్, షూపాలిష్, నిరోధ్, మిక్సీలు, గ్రైప్‌వాటర్, గడియారాలు, డ్రాయర్లు, బనీన్లు వగైరాలు. అందులో కొన్ని మాత్రమే స్వయంకృషితో శ్రీమతిసహకారంతో అందరాని ఎత్తులకు వెళ్లిన నరసింహన్‌గారు ఒక చక్కని నమూనాగా అందరూ భావించాలి.

**4. వి.జి.పి :** ఇది తమిళనాడులో ఏరోడ్డు మీద చూసినా, ఏ గోడపై చూసినా కనిపించే ఒక ప్రముఖమైన పేరు. వి.జి.పన్నీర్‌దాస్‌నే క్లుప్తంగా వి.జి.పి అంటారు. ఒకప్పుడు తాటాకులు మోసిన నిరుపేద కోటీశ్వరుడుగా మారడం అనేది సినిమాల్లో మాత్రమే జరిగే అద్భుతం అని అంతా అనుకోవచ్చు. కానీ పన్నీర్‌దాస్‌గారి జీవితం కూడా అంతే. నిరాశానిస్పృహలు చుట్టుముట్టి వున్నవారు పన్నీర్‌దాస్‌గారి నుండి ప్రేరణ పొందితే వారి జీవితాలలో చీకట్లు తొలగిపోయి కొత్త వెలుగు నిండుతుంది. కటికదరిద్రం తాండవించే నాడార్ కుటుంబంలో పన్నీర్‌దాస్ జన్మించారు. చిన్నతనంలోనే ఎంతో కొంత సంపాదించి కన్నవారిని తృప్తిపరచాలని ఆయనకెంతో కోరికగా వుండేది. వీధుల్లో దొరికే చెత్త నుండి డబ్బు సంపాదించాలని ప్రయత్నించారు. తాటాకులు మోసుకుని పక్కవూళ్లు చేరవేసి కొద్దిపాటి డబ్బు గడించారు. స్కూల్‌లో చదువుతూనే ఈ పని చేశారాయన. ఒకసారి స్కూల్‌లో పిక్నిక్ ఏర్పాటు చేస్తే ఆ సమయంలో కూలిచేసి కుటుంబాన్ని పోషించారాయన.

కొంతకాలం తర్వాత ఓ షాపు అమ్మకానికి వస్తే 150 రూపాయలకు కొన్నారు. కొట్టువాడు షాపు బాగా నడవడం చూసి తిరిగి షాపును స్వాధీనం చేసుకున్నాడు. అక్కడి నుంచి పన్నీర్‌దాస్ మద్రాస్ చేరారు. చిన్న చిన్న పనులు చేశారు. ఆ సమయంలో ఓ బ్రాహ్మణయువతిని కులాంతర వివాహం చేసుకున్నారు. ఆమె ప్రోత్సాహం వల్లనే తాను గొప్పవాణ్ణి అయ్యానని ఆయన చెప్పుకున్నారు. న్యూస్‌పేపర్ ఏజన్సీతో ప్రారంభించి, హోటల్ వ్యాపారం

పెట్టారు. గ్రామఫోన్ సాయంతో కస్టమర్లను ఆకర్షించారు. రేడియోలు, గడియారాలు వాయిదా పద్ధతులలో అమ్మడం మొదలుపెట్టారు. దక్షిణాదిలో తొలిసారి ఈ విధమైన వాయిదా పద్ధతిని ప్రవేశపెట్టింది ఆయనే. తర్వాత ఇళ్ళ స్థలాల అమ్మకాలు, కొనుగోలు, ఇల్లు కట్టి అమ్మడం, వీడియో కాసెట్స్ వ్యాపారం మొదలగునవి చేశారు. మహాబలిపురం వెళ్ళేదారిలో వి.జి.పి గోల్డెన్ బీచ్ నిర్మించారు. అది ఇప్పుడు సినిమావాళ్ళకు స్వర్గం. మన దేశంలో మరో డిస్నీలాండ్ రూపకల్పన చేస్తున్నారు. ఈ విధంగా అట్టడుగుస్థాయి నుంచి అంబరాన్ని అందుకున్న వి.జి.పి కన్నా ఆదర్శప్రాయం ఇంకెవరుంటారు?

**5. అంబికా :** అంబికాఅగరుబత్తి పేరు అందరికీ పరిచయమైనదే. దీని వెనకవున్న ఆలపాటి రామచంద్రరావుగారు చేసిన కృషి గురించి కొంత తెలుసుకోవాలి. చిన్నతనంలో చదువులో వెనకబడ్డ రామచంద్రరావుగారు తండ్రి చేస్తున్న జవ్వాది వ్యాపారంలో ప్రవేశించారు. తండ్రి నేర్పిన దేశీయవైద్యం ఉబ్బసాన్ని నయం చేయడం చూశారు. తండ్రి రాసిన తాటాకుల గ్రంథం తర్వాత ఆయనకు పనికి వచ్చింది. పెళ్లి జరిగి ఇల్లరికం వెళ్లాక తండ్రి మరణించారు. రెండుకుటుంబాల పోషణ బాధ్యత మీద పడడంతో మార్గం కోసం వెతుకుతూ వుండగా తండ్రిగారి తాటాకుల గ్రంథం గుర్తుకు వచ్చింది. వనమూలికల ఉపయోగం తెలిసింది ఉబ్బసం చికిత్స కోసం మందును తయారుచేసే పద్ధతి నుండి అగరుబత్తి తయారీకి స్ఫూర్తి లభించింది. 1953లో అంబికా జవ్వాది బత్తిని సన్నని పుల్లలుగా మార్కెట్ చేశారు. 1962లో అంబికాదర్బార్ బత్తిని లావుపుల్లలుగా ప్రవేశపెట్టారు. దర్బార్‌బత్తిని దేశంలో తొలిసారి తయారుచేసిన ఘనతను పొందారు. ఏలూరులో పారిశ్రామిక వాడ స్థాపన కోసం ప్రభుత్వంలో పోరాడి విజయం సాధించారు. విదేశాలకు ఎగుమతి చేశారు. 1979లో ఆంధ్రాబ్యాంక్ వారి ఋణసహాయం తన వ్యాపారాన్ని పదింతలు చేసిందని ఆయన అంటారు. ఫిజీద్వీపంలో అగరుబత్తి కంపెనీ స్థాపనకు ఆప్రభుత్వానికి సాయపడ్డారు. 1971లో అంబికా సంస్థ రజతోత్సవం చేసుకుంది. ఎన్నోరకాల అగరుబత్తులను వారు ప్రజలకు అందించారు. తొలిరోజులలో పౌడర్‌లు, సెంట్లు తయారుచేసి అంగళ్ల వెంటపడి అమ్మి హేళనలు, అవమానాలు ఎదుర్కొని ఒక లివింగ్ లెజెండ్ (సజీవగాథ) గా నిలిచారాయన. కొంచెం లోకజ్ఞానం, శ్రమ పడే గుణం వుంటే ఎవరైనా అద్భుతాలు చేయవచ్చు అని ఆయన నిరూపించారు. ఔత్సాహికులైన యువకులు ఆలపాటి వారి జీవితం నుంచి ప్రేరణ పొందాలి.

**6. ఒబెరాయ్ :** 1922లో చేతిలో చిల్లిగవ్వ లేకుండా హోటల్‌లో గుమాస్తాగా చేరిన వ్యక్తి 1934 లో అదే హోటల్‌ను కొన్నాడంటే ఏదో కథలోలాగా వుందనిపించవచ్చు. అయితే ఇది నిజం. ఒబెరాయ్ విషయంలో జరిగిందిది. ఈనాడు ఒబెరాయ్ ఫైవ్‌స్టార్ హోటల్స్ ప్రపంచప్రసిద్ధిని పొందాయి. నేపాల్,

శ్రీలంక, ఆస్ట్రేలియా, సింగపూర్, ఇండొనేషియా, టాంజానియా మొదలైన దేశాలలో 14 అంతర్జాతీయ స్థాయి హోటల్స్ వున్నాయి. ఒకప్పుడు నెలకు 40 రూపాయలు జీతంలో పనిచేసిన వ్యక్తికి ఈనాడు కొన్ని వందల కోట్లకు అధిపతి అయ్యాడంటే ఎంత కృషి చేసి వుండాలి? ప్రజలను ఎంత పరిశీలించి వుండాలి?

ఈవిధంగా ఎంతమందినైనా ఉదహరించవచ్చు. అంతదాకా ఎందుకు? మన ఊళ్లోనే, మన కళ్లముందే అంచెలంచెలుగా ఎదిగిపోయిన వ్యక్తులు ఉన్నారు. ఒక్కసారి వాళ్ల జీవితాలను పరిశీలిద్దాం. వారి జీవితాల నుండి ప్రేరణ పొందుదాం అని యువతీయువకులు నిర్ణయించుకోవాలి. అదే స్వయం ఉపాధికి పునాది.

## 4. స్వయంఉపాధి పథకాలకు ఏసంస్థ ఏం చేస్తుంది?

స్వయంఉపాధి పథకాలను ఎవరైనా ప్రారంభించవచ్చు. ఎక్కడైనా ప్రారంభించవచ్చు. పూలతోటలు, సర్వీసింగ్, వాహనాల నిర్వహణ, చిన్నపరిశ్రమలు - ఇలాఎన్నో రకాలుగా మొదలుబెట్టవచ్చు. స్వయంఉపాధికి పెద్ద చదువులు, డిగ్రీలు అవసరంలేదు. ప్రజలనిత్యజీవిత అవసరాలు దృష్టిలో వుంచుకుని తగిన పథకాలు రూపొందిస్తే విజయం తథ్యం. తయారు చేసే వస్తువుకు మార్కెట్‌లో ఎంత గిరాకీ, అవసరం వున్నాయో తెలుసుకోవడం ముఖ్యం. ఇందుకు ప్రభుత్వం వైపు నుంచి లభించే సహకారం గురించి తెలుసుకోవాలి. ఔత్సాహికులకు ఈనాడు మంచిప్రోత్సాహం లభిస్తోంది. చొరవ, తెలివి తేటలు, ఉత్సాహం, పట్టుదల వున్నవారినే విజయం వరిస్తుందనేది నగ్నసత్యం. పరిశ్రమ నెలకొల్పేందుకు అవసరమైన విషయాలు, నియమ నిబంధనలు సంబంధిత వ్యక్తుల నుంచి తెలుసుకోవాలి. జిల్లాపరిశ్రమల కేంద్రంలో దరఖాస్తు చేసుకుని తొలి అడుగు వేయాలి. వెయ్యి రూపాయల పెట్టుబడితో కూడా పరిశ్రమ ప్రారంభించవచ్చు. దరఖాస్తు పత్రం ఉచితం.

యంత్రపరికరాల కోసం స్టేట్ ఫైనాన్సియల్ కార్పొరేషన్, నేషనల్‌స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్ కార్పొరేషన్, ఖాదీ కమీషన్ మొదలైన సంస్థలు అప్పు ఇస్తాయి. పరిశ్రమ నడిపేందుకు కావలసిన వర్కింగ్ కాపిటల్‌ను బ్యాంకులు సమకూరుస్తాయి. ఇవికాక వెనుకబడిన తరగతులకు, షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ జాతులకు ప్రత్యేకంగా ఆర్థిక సహాయం చేసే సంస్థలున్నాయి. పరిశ్రమ ప్రారంభించేందుకు వ్యక్తి పెట్టుబడిని ఈ సంస్థలే సమకూరుస్తాయి. ఇతర కులాలవారికి కూడా ప్రభుత్వం కొద్దిగా సహాయం చేస్తుంది. ఈ సొమ్మునే **సీడ్‌కాపిటల్** లేక మార్జిన్‌మనీ అంటారు.

ఉదాహరణకు, ఒక పరిశ్రమ పెట్టేందుకు ఇరవై వేలు పెట్టుబడిఅవసరం వున్నప్పుడు స్థాపకుడు పదివేలు పెడితే ప్రభుత్వం మిగిలిన పదివేలు ఇస్తుంది. **ఇదే సీడ్ కాపిటల్**

పరిశ్రమ ఏర్పాటుకు కావలసిన భూమి, షెడ్‌లు వగైరాలను ఆంధ్రప్రదేశ్ ఇన్‌ఫ్రాస్ట్రక్చరల్ కార్పొరేషన్ సమకూరుస్తుంది. వివిధదశలలో పరిశ్రమకు కావలసిన పరిజ్ఞానాన్ని ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ టెక్నికల్ కన్సల్‌టెన్సీ ఆర్గనైజేషన్, నేషనల్ స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్ ట్రెయినింగ్ ఇన్‌స్టిట్యూట్, స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్ సర్వీసింగ్ ఇన్‌స్టిట్యూట్, స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్, బ్యాంకులు మొదలైన సంస్థలు అందిస్తాయి. ఇందుకోసం వారు శిక్షణా కార్యక్రమాలు నిర్వహిస్తారు. వీటికి సంబంధించిన వివరాలు పత్రికలలో ప్రకటిస్తారు.

ప్రాజెక్టుల ఎన్నిక గురించి ప్రైవేట్ సంస్థలు కొంత సొమ్ము తీసుకుని సలహాలిస్తున్నాయి. ప్రభుత్వ సంస్థలు కూడా కొంత సొమ్ము తీసుకుని అందిస్తున్నాయి. ఈ ప్రాజెక్ట్ వివరాలు ఎవరైనా కొంత శ్రమతో తయారు చేసుకోవచ్చు. ఇందుకోసం ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ కన్సల్‌టెన్సీ ఆర్గనైజేషన్, స్మాల్ ఇండస్ట్రీస్ సర్వీస్ ఇన్‌స్టిట్యూట్, స్టేట్‌ఫైనాన్షియల్ కార్పొరేషన్, జిల్లా పరిశ్రమల శాఖ, బ్యాంకుల ప్రధాన కార్యాలయాలు సహాయం చేస్తాయి. ఉచిత ప్రాజెక్టు వివరాలు కావలసినవారు రాష్ట్ర ఆర్థిక సంస్థ, జిల్లా పరిశ్రమల శాఖ పరిశ్రమల కమీషనర్ వగైరాలను సంప్రదించాలి.

ప్రత్యేకంగా శిక్షణా కార్యక్రమాలు తరచుగా జరుగుతుంటాయి. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలి.

పరిశ్రమలు స్థాపించేవారికి ముడిసరుకుల కొనుగోలులో ఆంధ్రప్రదేశ్ స్టేట్ స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ సాయం చేస్తుంది. మార్కెటింగ్‌లో కూడా ఈ సంస్థ సాయం లభిస్తుంది. ఇతరులకు ఉత్పత్తి అమ్మితే డబ్బు వసూలు కావడానికి ఆలశ్యం అవుతుంది. అయితే ఈసంస్థ వారి పథకం ద్వారా కావలసిన వస్తువుల ధరలో ఏభై శాతం అడ్వాన్సుగా లభిస్తుంది. తక్కువ వర్కింగ్ కాపిటల్‌తో పరిశ్రమ నెలకొల్పే అవకాశం వుంటుంది. ఈ సౌకర్యం కొన్ని ఉత్పత్తులకే పరిమితం.

## 5. పరిశ్రమకు స్కీమ్ రూపొందించడం ఎలా?

పరిశ్రమకు స్కీమ్ రూపొందించే ముందు అన్ని విషయాలు తెలుసుకోవాలి. తర్వాత జిల్లా పరిశ్రమశాఖలో తమపేరు, సంస్థ పేరు తాత్కాలికంగా నమోదు చేయించాలి. ఈ సర్టిఫికెట్ ఆధారంగా గ్రామపంచాయితీ, మునిసిపాలిటీ, విద్యుత్తు, అమ్మకం పన్ను మొదలైన శాఖలవారి అనుమతులు పొందాలి. వీటితోపాటు మార్కెటింగ్ ఆర్డర్స్, గిరాకీవివరాలు, యంత్రాల కొటేషన్స్, ముడిసరుకు వసతులు తెలిపే కాగితాలు జతపరచాలి. ఈ సర్టిఫికెట్‌కు 2 సంవత్సరాలపాటు విలువ వుంటుంది. ఈలోగా సంస్థను ప్రారంభించాలి.

పరిశ్రమ ప్రారంభం అయిన తర్వాత శాశ్వత సర్టిఫికెట్ ఇస్తారు. బ్యాంకులు, రాష్ట్ర ఆర్థిక సంస్థ ఈ సర్టిఫికేట్ ఆధారంగానే రుణాలు ఇస్తాయి. శాశ్వత సర్టిఫికెట్ వచ్చిన తర్వాత 25 శాతం విద్యుత్ సబ్సిడీ, ప్రత్యేక టెలిఫోన్, ఎర్నెస్ట్‌మనీ, సెక్యూరిటీ డిపాజిట్ లేకుండా ప్రభుత్వ, ప్రభుత్వ రంగ సంస్థల ఆర్డర్స్ లభిస్తాయి. కింద పేర్కొన్న వివరాల ప్రకారం ఎవరికివారు చిన్న స్కీములు రూపొందించుకోవచ్చు.

**స్కీమ్ వివరాలు :** స్కీమువివరాలు కింది విధంగా వుండాలి.

1. ప్రారంభించే యూనిట్, తయారు చేసే వస్తువుల పేర్లు 2. ఉత్పత్తి, అమ్మకం సంక్షిప్త వివరాలు 3. భూమి, భవనం వివరాలు - సొంతమా? బాడుగదా? భవనం కొలతలు 4. కావలసిన యంత్రాలు, ఆఫీస్ పర్నిచర్ ఖర్చు 5. ముడి సరుకు వివరాలు (నెలకు) 6. పనివారి సంఖ్య, నెలజీతాలు 7. స్టేషనరీ, కరెంట్, అద్దె వగైరా చిల్లర ఖర్చులు 8. నిర్వహణ పెట్టుబడి లేక వర్కింగ్‌కాపిటల్ (3 నెలలకు) - (ముడిసరుకులు, జీతభత్యాలు, ఇతర ఖర్చులు) 9. మొత్తం ఖర్చు - యంత్రాలు, వర్కింగ్ కాపిటల్ 10. అమ్మకం, లాభం మొదలైన ఇతర వివరాలు.

## 6. రుణాలకు దరఖాస్తులతో ఇవ్వదగ్గ పూర్తివివరాలు

దరఖాస్తులతో సహా కింది వివరాలు ఇవ్వాలి:

1. స్థలం అమ్మకం పత్రం (సేల్స్‌డీడ్) (అమ్మకం ఒప్పందం, స్థలం, వివరాలతో సహా)

2. కౌలు కమతం అయితే కనీసం 30 సం.ల రిజిస్టర్డ్ లీజ్ ఒప్పందం ప్రతి (కాపీ)

3. భవనం ప్లాను, సైట్‌ప్లాన్, ఎస్టిమేట్ వివరాలు.

4. కొటేషన్‌లు, సాంకేతికవివరాలు, సమాచారం, అవసరమైన చోట్ల (రిజిస్టర్డ్ సప్లైయర్ కాని పక్షంలో) కొటేషన్‌ల కంపారిటివ్ (పోల్చిచూపే) స్టేట్‌మెంట్‌లతో అన్ని యంత్రపరికరాల వివరాలు.)

5. విద్యుత్తు వివరాలు, అంత విద్యుత్తు పొందేందుకు చేసిన ఏర్పాట్లు

6. నీరు, ఇంధనం అవసరాలు, వాటి ధరల వివరాలు.

7. ఏర్పాటు చేస్తున్న యంత్రాల, పరికరాల సామర్థ్యం వివరాలు.

8. కావలసిన ముడి పదార్థాలు, వాటి అందుబాటు, ఏ విధంగా పొందేదీ మొదలైన వివరాలు.

9. కావలసిన నిపుణులు, మామూలు పనివారు వారి జీతభత్యాల వివరాలు.

10. మార్కెట్ విలువను బట్టి ప్రతిపాదించిన ఉత్పత్తుల కొటేషన్‌లు.

11. పథకం లాభనష్టాలు.

12. ఉత్పత్తి తయారీ వివరాలు, మార్కెట్ గిరాకీ విశ్లేషణ వివరాలు.

13. వ్యవస్థాపకుల జీవిత విశేషాలు, ఆర్థికస్థాయి మొదలైన వివరాలు.

14. సాంకేతిక నిపుణుల, సలహాదారుల వివరాలు.

15. పరిశ్రమ అమలుపద్ధతి

16. ఇంత వరకు సాధించిన ప్రగతి

17. లఘు పరిశ్రమ రిజిస్ట్రేషన్ నకలు.

18. ఇప్పటికే సంస్థ పనిచేస్తున్న పక్షంలో, లేక ఇప్పటికే వేరే యూనిట్‌లో వ్యవస్థాపకులు పని చేస్తున్న పక్షంలో ఆ కంపెనీ మూడేళ్ల బాలన్స్‌షీట్‌లు, లాభనష్టాల వివరాలు.

ఈ వివరాలున్న దరఖాస్తులు ఆయా సంబంధిత ప్రాంతీయ శాఖా కార్యాలయాలలో ఇవ్వాలి.

## 7. ఔత్సాహిక పారిశ్రామికులు గమనించవలసిన అంశాలు

1. పరిశ్రమలు స్థాపించేందుకు అనువైన ప్రదేశం వ్యవసాయభూములకు దగ్గరగా ఉండకూడదు. రక్షిత ప్రాంతం, బహిరంగస్థలాలు, ఇళ్లస్థలాలు వగైరాలు కాకూడదు. వ్యవసాయ భూములను పరిశ్రమల భూమిగా మార్చేందుకు కలెక్టర్‌కు హక్కుంది. అయితే ఆ ప్రదేశం మునిసిపాలిటీ జోనల్ అభివృద్ధి కింద వున్నా, అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీ (పట్టణ అభివృద్ధి సంస్థ) కింద వున్నా ప్రభుత్వం మినహాయింపు ఇవ్వాలి (ఇందుకు చాలా కాలం పడ్తుంది కాబట్టి దీనిని ఎత్తి వేయాలని చాలామంది కోరుతున్నారు). డైరెక్టర్ (టౌన్ అండ్ కంట్రీప్లాన్) గారు అటువంటి కేసులను పరిష్కరిస్తారు. తమ పరిధిలోకి వచ్చే కేసులను పట్టణఅభివృద్ధి సంస్థ చూస్తుంది.
2. అటవీ ప్రాంతానికి, జంతువుల పార్క్ లేక పబ్లిక్‌గార్డెన్స్ (ఉదా. హైదరాబాద్) వంటి ప్రాంతాలకు 5 కి.మీ. పరిధిలోకాని, రక్షణ రంగ ప్రాంతానికి 10 కి.మీ. పరిధిలో కానీ పరిశ్రమలు స్థాపించకూడదు.
3. జాతీయ రహదారికి 2 కి.మీ దూరంలోనూ ఇళ్ళున్న ప్రాంతానికి 2 కి.మీ దూరం లోపలా స్టోన్‌క్రషింగ్‌యూనిట్‌లు (బండలు బద్దలు కొట్టే యూనిట్‌లు) ఉండకూడదు. రెండు స్టోన్ క్రషింగ్ యూనిట్‌ల మధ్య కనీసం 4 కి.మీ. దూరం ఉండాలి. (ఆంధ్రప్రదేశ్ పొల్యూషన్ కంట్రోల్ బోర్డ్ వారు డైరెక్టర్ (టౌన్ & కంట్రీప్లాన్) కు రాసిన ఉత్తరం

నెం.539/పి.సి.బి/అపేన్/90-4128 తే. 16.8.90 చూడండి)

4. ప్రమాదకరమైన వస్తువులను తయారుచేసే పరిశ్రమలను (ప్రభుత్వం ఇరవై వస్తువులను గుర్తించింది) స్థాపించేముందు పర్యావరణ శాఖవారి అనుమతి పొందాలి.

5. పర్యావరణ పరంగా, పరిసర విజ్ఞానపరంగా ముఖ్యమైన ప్రాంతాలకు 25 కి.మీ లోపల పరిశ్రమలు స్థాపించకూడదు.

6. టౌన్ & కంట్రీ ప్లానింగ్, ఫ్యాక్టరీస్, ఆరోగ్యం, కాలుష్య నియంత్రణ వారి సమ్మతి, ఆర్థిక సహాయం చేసేవారి అనుమతులు మొదలైనవన్నిటి క్లియరెన్స్ లభిస్తే కానీ పరిశ్రమ స్థాపించలేం.

7. సాంకేతికపరమైన అనుమతులు లేకుండా కేవలం పంచాయితీ, మునిసిపాలిటీ, పట్టణ అభివృద్ధి సంస్థ అనుమతి మాత్రమే వుంటే లాభంలేదు.

8. విద్యుత్ సరఫరా విషయంలో జాగ్రత్త పడాలి.

9. చాల శాఖలు, సంస్థలు క్లియరెన్స్ ఇవ్వాలి. ఒక్కోసారి ఇది గొలుసు చర్య. అంచేత ఒక చెక్ లిస్ట్ ఉండాలి. ఒక్కోసారి ఎన్నో క్లియరెన్స్‌లకు ఒకేసారి ప్రయత్నించ వలసి వుంటుంది.

10. అప్లికేషన్‌లో సరైన సమాచారం అందించాలి. అంచేత సంబంధిత అధికారులను ముందే కలిసి లేక క్రిస్ప్ సహాయం తీసుకుని (ఇక్కడైతే జిల్లా పరిశ్రమల కేంద్రంలో గురువారం సమావేశానికి అందరూవస్తారు) పనులు చేసుకోవాలి.

11. కొన్ని ముడిసరుకులు సంపాదించడం, కొన్ని వస్తువులు మార్కెట్ చేయడం కష్టం. అంచేత ఇటువంటి విషయాలలో ముందుగానే చర్యలుతీసుకోవాలి.

12. సప్లైయర్స్ నుండి తాజా సమాచారం సేకరించిన తర్వాతే ఆర్థిక సహాయం కోసం ప్రయత్నించాలి. లేకుంటే ఆర్థిక సహాయం చాలినంతరాక పరిశ్రమ మూతపడాల్సి వస్తుంది.

13. క్లియరెన్స్, అప్రూవల్ వగైరా రావడంలో నెలకన్నా ఎక్కువ ఆలస్యం అయితే పూర్తి వివరాలతో అపేన్ లేక క్రిస్ప్ సంస్థల సలహా సహకారాలు తీసుకుంటే పని తొందరగా జరుగుతుంది.

14. జూలై 1991 లో పారిశ్రామిక విధానాల సరళీకరణ జరిగింది. ఇందువల్ల లైసెన్సులు ఇవ్వడంలో చాలా మార్పులు వచ్చాయి. పాలనా సంబంధంగా సూచనలు ఇచ్చారు. ఈ మార్పులను ఔత్సాహికులు గుర్తించి అపేన్ సహకారం పొందాలి.

15. రిజర్వ్ ఫారెస్ట్ ప్రాంతంలో ఖనిజాల అన్వేషణకు వీలులేదు. అంచేత అటవిశాఖ అనుమతి లేకుండా అటువంటి పనులు పెట్టుకోకూడదు. రిజర్వ్

ఫారెస్ట్‌కు 30 కిలోమీటర్లలోపల సామిల్స్ వుండకూడదు. దూరంతో నిమిత్తం లేకుండా డివిజనల్ ఫారెస్ట్ ఆఫీసర్ అనుమతి పొందడం అవసరం.

16. వ్యవసాయ భూములకు చెందిన పత్రాల రిజిస్ట్రేషన్‌కు స్టాంప్స్ & రిజిస్ట్రేషన్ విభాగంవారు స్టాంపు డ్యూటీ విధిస్తారు. ఈ భూములను పరిశ్రమలు, తదితర అవసరాలకు కొని వుండవచ్చు. దీనికి ఇంటిస్థలానికి వేసినట్లే మార్కెట్ విలువ ప్రకారం పన్ను విధిస్తారు. అందువల్ల పరిశ్రమలకోసం కొనే స్థలాల వెల మరింత పెరిగింది. దీని గురించి సాధారణంగా ఔత్సాహికులకు అంత అవగాహన వుండదు. అంచేత ప్రాజెక్టు రూపొందించుకునేటప్పుడు ఈ విషయం గుర్తుంచుకోవాలి.

17. గిరిజన ప్రాంతాలను వాడుకోవాలంటే వారికి తగిన పరిహారం ఇవ్వాలి. అందుకు ప్రభుత్వం అనుమతించాలి. ట్రైబల్స్ అంగీకరించినా ఆ భూమిని ఇతరులు తాకట్టు పెట్టుకునేందుకు ప్రభుత్వం ఒప్పుకోదు. అంచేత ట్రైబల్స్ కానివారు ఆ ప్రాంతాలలో పరిశ్రమలు పెట్టేముందు జాగ్రత్తపడాలి.

18. ఇప్పటి ప్రొసీజర్ (పద్ధతి) ప్రకారం పదివేల రూపాయలు లేక అంతకన్నా తక్కువ విద్యుత్ ఖర్చులు పెట్టుకునే చిన్న పరిశ్రమలకు మాత్రమే విద్యుత్‌బోర్డు వారు సర్వీస్‌లైన్ ఛార్జీలలో మినహాయింపు ఇస్తారు. అంచేత ముందే విద్యుత్ ఖర్చులు ఎంత కావచ్చు అని సరిగా తెలుసుకోవాలి. లేకుంటే కరెంట్ ఖర్చు షాక్ కొట్టేస్తుంది.

ఈ విధంగా అన్ని విషయాలను కూలంకషంగా పరిశీలించి, జాగ్రత్తపడితే ఎటువంటి ఇబ్బందులూరావు.

## 8. స్వయంఉపాధికి ప్రభుత్వ సహకారం

పరిశ్రమల శాఖ సహాయంతో అపేస్ (APACE) అనే సంస్థ (ఆంధ్రప్రదేశ్ అసిస్టెన్స్ సెంటర్ ఫర్ ఎంటర్‌ప్రెన్యూర్స్) ఔత్సాహికులైన పారిశ్రామికులకు సాయపడేందుకు ఏర్పడింది. ఈ సంస్థ ఒక పుస్తకం తయారుచేసింది. దీనిపేరు "ఇండస్ట్రియల్ క్లియరెన్సెస్ : స్టాండర్డ్‌నార్మ్స్ అండ్ ప్రొసీజర్స్" ప్రచురణ : అపేస్, కేరాఫ్ కమిషనర్ అఫ్ ఇండస్ట్రీస్, చిరాగ్ అలీ లేన్, హైదరాబాద్-500001, డిసెంబర్ 1991, వెల : నూరు రూపాయలు మాత్రమే. పరిశ్రమలు స్థాపించాలంటే ఏంచేయాలో ఇది వివరిస్తుంది. ప్రభుత్వం తరఫున సలహాలు, ఆర్థిక సహకారం, నియమ నిబంధనలు మొదలైనవి తెలుసుకునేందుకు ఈ పుస్తకం ఉపయోగపడుతుంది.

సాధారణంగా ఔత్సాహికులకు నియమ నిబంధనల గురించి అవగాహన వుండదు. అదో పీడకల మాదిరి వుంటుంది. ఒక్కొక్కచోటికి వెళ్ళి

ఒక్కొక్క సమాచారం తెలుసుకోవాలన్నా కష్టమే. ఇంతా చేస్తే ప్రతిశాఖవారూ ఏదో అడ్డుపుల్ల వేస్తారు. ఈ పరిస్థితులు రాకుండా వుండాలంటే ఈ పుస్తకం చదవాలి.

ఇటీవల కొత్త పారిశ్రామిక విధానంలో అనేక సడలింపులు రావడంతో పరిశ్రమలు స్థాపించే ధోరణి కొద్దిగా పెరిగింది. అయితే లైసెన్సులు, క్లియరెన్సులు కాస్త ఇబ్బందికరంగానే వున్నాయి. ఇరవైశాఖలదాకా క్లియరెన్స్ ఇవ్వాలి. ఇప్పుడు సమాచారం అందరికీ అందుబాటులో వున్నందువల్ల కొంతపని సులభం అవుతుంది. ఒక ప్రాజెక్టుకు నియమావళి అంతా పాటించినా సమ్మతి లభించని షక్షంలో ఒకనెల ఆలస్యం అయినా లక్షల రూపాయల వడ్డీ నష్టపోవలసి వస్తుంది. ఇందుకోసం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సింగిల్ విండో ఫారమ్, అపేన్, ఇటీవలే క్రిస్ప్ (CRISP) కౌన్సిల్ వగైరాలను స్థాపించి క్లియరెన్స్, అప్రూవల్ (అభ్యంతరాలను తొలగించి అంగీకరించడం) వేగంగా జరిపించే వీలు కల్పించింది.

# 9. ఏ స్థాయిలో ఏ సంస్థ సాయంచేస్తుంది?

పెద్ద, మధ్య, చిన్న, బుల్లి (టైనీ), కుటీర, గ్రామీణ స్థాయి పరిశ్రమలను ప్రోత్సహించి అభివృద్ధి చేసేందుకు రాష్ట్రస్థాయిలోనూ, కేంద్రస్థాయిలోనూ ఎన్నో సంస్థలు, ఏజెన్సీలు ఉన్నాయి. పారిశ్రామిక అభివృద్ధి, క్రమబద్ధీకరణ చట్టం (1951) కింద వచ్చే పెద్ద, మధ్యరకాల పరిశ్రమల గురించి చర్య తీసుకునేందుకు డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్‌లోని పరిశ్రమల మంత్రిత్వశాఖ వుంది. అదేమంత్రిత్వ శాఖలోని డెవలప్‌మెంట్‌లోని పరిశ్రమల మంత్రిత్వశాఖ వుంది. అదే మంత్రిత్వ శాఖలోని డెవలప్‌మెంట్ కమీషనర్ (స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్) చిన్న పరిశ్రమల రంగం నియమావళిని రూపొందిస్తారు. ఇందుకు ప్లానింగ్ కమిషన్ సహకారం వుంటుంది. వీరు ఒక్కో రాష్ట్రంలోని స్మాల్ ఇండస్ట్రీస్ సర్వీస్ ఇన్‌స్టిట్యూట్స్ నెట్‌వర్క్ సాయంతో నియమావళి అమలుతీరుకు బాధ్యత వహిస్తారు. వీటితోపాటు ఖాదీ, గ్రామీణ పరిశ్రమల సంస్థ, నేషనల్ బోర్డ్ ఆఫ్ హాండిక్రాఫ్ట్స్, కొబ్బరిపీచు, ఉప్పు, పట్టుపరిశ్రమ వగైరా జాతీయబోర్డులు ఉన్నాయి.

రాష్ట్రస్థాయిలో ఇండస్ట్రీస్ & కామర్స్ విభాగానికి అధిపతిగా ప్రిన్సిపల్ సెక్రటరీ వ్యవహరిస్తారు. కమీషనర్ ఆఫ్ ఇండస్ట్రీస్ అభివృద్ధి వ్యవహారాలు చూస్తారు. ఇందుకు ఆయనకు అన్ని విభాగాల నుంచి సాంకేతిక నిపుణులు సహకరిస్తారు. జిల్లాస్థాయిలో జిల్లా పరిశ్రమ కేంద్రం వుంటుంది. దీనికి జాయింట్ డైరెక్టర్ హోదాలో ఒక జనరల్‌మేనేజర్ వుంటారు. వీరికి సహాయంగా కొందరు క్రియాశీల (ఫంక్షనల్) మేనేజర్‌లు ఉంటారు. ప్రాథమిక స్థాయి లేక అట్టడుగు స్థాయిలో విస్తరణాధికారి (ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్) పర్యవేక్షి

స్తారు. వీరికి తోడుగా సూపర్‌వైజర్‌లు, టెక్నికల్ అసిస్టెంట్‌లు (సాంకేతిక సహాయకులు) జనరల్ మేనేజర్‌కు సహకరిస్తారు. వీరు జిల్లా ప్రధానకేంద్రం (హెడ్‌క్వార్టర్స్) నుండి పనిచేస్తారు. పరిశ్రమలశాఖ పరిశ్రమలను ప్రోత్సహించి, క్రమబద్ధం చేస్తుంది.

దీనికి తోడుగా ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక అభివృద్ధి సంస్థ (ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ కార్పోరేషన్) (APIDC) ఆంధ్రప్రదేశ్ చిన్న పరిశ్రమల అభివృద్ధి సంస్థ (స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్ డెవలప్‌మెంట్ కార్పోరేషన్) (APSSIDE) ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫైనాన్షియల్ కార్పోరేషన్ (APSFC), ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చరల్ కార్పోరేషన్(APIISC)లు ఆంధ్రప్రదేశ్ ఎలెక్ట్రానిక్ డెవలప్‌మెంట్ కార్పోరేషన్ (APEDC), ఆంధ్రప్రదేశ్ స్టేట్‌నాన్ రెసిడెన్షియల్ ఇండియన్స్‌కార్పోరేషన్ (ANRICH), ఆంధ్రప్రదేశ్ అగ్రో ఇండస్ట్రీస్ కార్పోరేషన్ (APAGROS), ఆంధ్రప్రదేశ్ హేండీక్రాఫ్ట్స్ డెవలప్‌మెంట్ కార్పోరేషన్, ఆంధ్రప్రదేశ్ మినరల్ డెవలప్‌మెంట్ కార్పోరేషన్ (APMDC), ఆంధ్రప్రదేశ్ ఖాదీ & విలేజి ఇండస్ట్రీస్ వీటన్నిటికీ సమన్వయకర్తగా వ్యవహరిస్తారు. APIDC సంస్థ, APSFC సంస్థ, బ్యాంకులు పరిశ్రమలకు ఆర్థిక సహాయం అందించడంలో కీలకమైన పాత్రను నిర్వహిస్తాయి.

ప్రతిజిల్లా కేంద్రంలోనూ ఉన్న జిల్లాపారిశ్రామిక కేంద్రాలు అన్నీ కలిసి ఒక నెట్‌వర్క్‌గా పనిచేస్తాయి. పరిశ్రమల స్థాపనను ప్రోత్సహించడం, క్రమబద్ధం చేయడం, సమన్వయం చేయడం, అన్ని ఏజెన్సీలతో మధ్యవర్తిగా వ్యవహరించడం పరిశ్రమలకు త్వరగా ప్రభుత్వ అనుమతి వచ్చేలా చేయడం మొదలైనవి డైరక్టరేట్ ఆఫ్ ఇండస్ట్రీస్ పని. వీరు ఏర్పాటుచేసిన అపేన్ సంస్థ సింగిల్ విండో ఏజన్సీలాగా పనిచేస్తుంది. అపేన్ సంస్థ ఒక ప్రత్యేకమైన వేదిక (ఫోరమ్) ను ఏర్పరచింది. అందరూ కలిసి పనిచేస్తేనే అందం చందం కదా మరి!

డైరక్టరేట్ ఆఫ్ ఇండస్ట్రీస్‌కు కమిషనర్ ఆఫ్ ఇండస్ట్రీస్ ముఖ్య అధిపతి. కేంద్ర కార్యాలయంలో ఒక అడిషనల్ డైరెక్టర్, పదకొండుగురు జాయింట్ డైరెక్టర్‌లు, పదిమంది డిప్యూటీ డైరక్టర్‌లు, పదముగ్గురు అసిస్టెంట్ డైరెక్టర్‌లు, పర్యవేక్షక, సహాయక సిబ్బంది వుంటారు. పాలనా వ్యవహారాలు, ప్రోత్సహకాలు, ముడిసరుకులు మొదలైన విశేషాలు జాయింట్ డైరెక్టర్‌లు చూసుకుంటారు. ఆహారం, రసాయనాలు, ఎలక్ట్రికల్, ఎలక్ట్రానిక్స్, ఖనిజ పరిశ్రమలు, పారిశ్రామిక ఇంజనీరింగ్, స్వయం ఉపాధి, మార్కెటింగ్ వగైరాలను ఆదేస్థాయికి చెందిన డెవలప్‌మెంట్ ఆఫీసర్‌లు పర్యవేక్షిస్తారు. కేంద్ర కార్యాలయంలో పూర్తిస్థాయి గ్రంథాలయం, డాక్యుమెంటేషన్ కేంద్రం వుంటాయి. జిల్లా స్థాయిలోజాయింట్ డైరెక్టర్ హోదా వున్న జనరల్ మేనేజర్, డిప్యూటీ డైరెక్టర్ హోదా వున నలుగురు మేనేజర్‌లు, ఇతర సూపర్‌వైజర్లు వగైరాలు ఉంటారు.

1960లో ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రీస్ డెవలప్‌మెంట్ కార్పోరేషన్ సంస్థ పెద్ద, మధ్య పరిశ్రమల అభివృద్ధికి సాయపడుతుంది. దీని లక్ష్యం ఈ రెండురకాల పరిశ్రమలను అభివృద్ధి చేయడమే.

ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చరల్ కార్పోరేషన్ లిమిటెడ్ సంస్థ ప్రభుత్వ యాజమాన్యంలో 1973లో ఏర్పడింది. ఇండస్ట్రియల్ ఎస్టేట్‌లను ఏర్పాటు చేయడం, ఆ ప్రదేశాలకు అనువైన భూమిని అభివృద్ధి చేయడం, వాటికి కావలసిన నీటిసరఫరా, షెడ్‌లు, రోడ్లు, ఇళ్లు వగైరాలను సమకూర్చడం దీనిపని. దీనిగురించి వివరాలు కావలినవారు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్, APIISC 6 ఫ్లోర్, పరిశ్రమ్ భవన్, బషీర్‌బాగ్, హైదరాబాద్ - 500 039 అనే అడ్రస్‌కు రాసి తెలుసుకోవచ్చు.

## 10. అపేస్ సంస్థ ప్రత్యేక కార్యక్రమం-క్రిస్ప్

ఈ కార్యక్రమం క్రింద ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలు సరైన ఉత్పత్తులు ఎన్నుకునేందుకు సలహాలు, సూచనలు ఇస్తారు. ప్రభుత్వశాఖలు, సంస్థలు, లైసెన్సింగ్ విధానం వగైరాలను తెలియజేస్తారు. పరిశ్రమలు స్థాపించేముందు కావలసిన మంజూర్లు, అనుమతులు ఏ విధంగా తెచ్చుకోవాలో సూచిస్తారు. ఆలస్యాలవల్ల పరిశ్రమ మొదలు కాకముందే మాతపడేప్రమాదంనుంచి కాపాడుతారు.

అపేస్ సంస్థను 27-6-1983న స్థాపించారు. ఇది సింగిల్ విండో పద్ధతిలో పనిచేస్తూ ఔత్సాహికులకు అన్ని సమస్యలకూ ఒకేచోట పరిష్కారం సూచించే ఉద్దేశ్యంతో ఏర్పడింది. ఈ రాష్ట్రస్థాయి సంస్థ ముఖ్యంగా పెద్ద, మధ్య పరిశ్రమలకు ఉపయోగకారి. కొన్ని పాలసీ విధానాలకు సంబంధించినంతవరకు చిన్న పరిశ్రమలకు సాయం చేస్తుంది. జిల్లా స్థాయిలో నోడల్ ఏజన్సీ సంస్థ చిన్న, బుల్లి పరిశ్రమల సమస్యలను పరిష్కరిస్తుంది.

ఈ అపేస్ సంస్థలో అనేక ప్రభుత్వ సంస్థల అధిపతులు ఉంటారు. దీనికి ఒక ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి అధ్యక్షులుగా వ్యవహరిస్తారు. జిల్లాస్థాయి నోడల్ ఏజన్సీకి కలెక్టర్ ఛైర్మన్‌గా వ్యవహరిస్తారు. జిల్లా పరిశ్రమల కేంద్రం జనరల్ మేనేజర్ సమన్వయ సభ్యులుగా వుంటారు. ఇండస్ట్రీస్ కమీషనర్ కార్యాలయంలోని అపరేషన్ బ్యూరో దీని కార్యాలయంలాగా పనిచేస్తుంది. ఈ కార్యాలయం ఎంటర్ ప్రెన్యూర్స్ (ఔత్సాహికులు) నుండి దరఖాస్తులు వగైరాలు స్వీకరించి దానికి అనుగుణంగా చర్యలు తీసుకుంటుంది.

అపేస్, నోడల్ ఏజన్సీలు నెలకోసారి సమావేశమై పెండింగ్‌లో వున్న కేసులను పరిష్కరిస్తాయి. ఏ కారణాల వల్లనైనా అపేస్ నిర్ణయాలు అమలు కాని పక్షంలో ఉన్నత స్థాయి కమిటీకి సమస్యను బదలాయిస్తారు. ఈ కమిటీ తరచూ కలిసి తగిన చర్యలు తీసుకుంటుంది.

అపేస్‌కు సాయం చేసేందుకు క్రిస్ప్ కార్యక్రమం సెప్టెంబర్ 1990 నుండి మొదలైంది. క్రిస్ప్ అంటే కౌన్సిల్ ఫర్ రిసీట్ అఫ్ అప్లికేషన్స్ ఫ్రమ్ ఇండస్ట్రీ ఫర్ శాంక్షన్స్ అంటే పర్మిషన్స్ అని అర్థం. పరిశ్రమలనుండి మంజూర్లకు, అనుమతులకు దరఖాస్తులు స్వీకరించే సంఘం అన్న మాట! ఇందులో పరిశ్రమకు అనుమతులు మంజూరు చేసే ఎనిమిది ముఖ్యమైన ప్రభుత్వ శాఖలకు చెందిన సీనియర్ ఆఫీసర్‌లు ఉంటారు. వీరంతా ఒకే చోట చేరి అప్లికేషన్స్ స్వీకరించి త్వరగా అనుమతిని ఇచ్చేందుకు కృషి చేస్తారు. ఇందువల్ల ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలకు ఎంతో మేలు చేకూరుతుంది. ఎన్నో ఇబ్బందులు తొలగిపోతాయి. ఈ సంస్థల సహాయం లేక ముందు ఔత్సాహికులు పడ్డ ఇబ్బందులు అంతా ఇంతా కాదు.

# 11. యువ ఔత్సాహికులకు ప్రోత్సాహం

20-35 సంవత్సరాల వయసు, కనీసం 10వ తరగతి చదువు ఉన్నవారికీ, విద్యార్హతలు లేని వృత్తిపని వారికీ స్వయం ఉపాధి పథకాలు నెలకొల్పేందుకు సహాయం లభిస్తుంది.

కొత్త పరిశ్రమలకు మాత్రమే ఆర్థిక సహాయం లభిస్తుంది. పారిశ్రామిక, సేవాసంబంధ పరిశ్రమల స్థాపనకు మాత్రమే ఆర్థిక సహాయం వుంటుంది. ప్రస్తుతం ఉన్నవాటి విస్తరణకు, మార్పులకు, ఆధునీకరణకు ఆర్థిక సహాయం లభించదు. స్థాపించబోయే పరిశ్రమ అన్ని విధాలా లాభసాటిగా వుండాలి. భూమి కొనుగోలు, భవన నిర్మాణం, యంత్ర పరికరాల కొనుగోలు, పరిశ్రమ నిర్వహణ ఖర్చు (వర్కింగ్ కాపిటల్) మొత్తం పదిహేను లక్షలకు మించ కూడదు. ఖర్చులో 20 శాతం కానీ, యాభైవేల రూపాయలు కానీ ఏది తక్కువైతే అది మార్జిన్ మనీగా లభిస్తుంది. రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చే ఈ మార్జిన్ మనీ ప్రాజెక్ట్‌లోని వ్యవస్థాపకుని వాటా మూలధనంగా పరిగణింపబడుతుంది. ఆ పైన లోటు వున్న పక్షంలో ప్రాజెక్ట్ ఖరీదులో ఐదు నుంచి పది శాతం వరకు వ్యవస్థాపకుడే పెట్టుబడి పెట్టాల్సి వుంటుంది. షెడ్యూల్డ్ కులాలు, జాతులకు, మహిళలకు ప్రత్యేక సీడ్ క్యాపిటల్ అందిస్తారు. నిర్వహణ, మూలధనంతో ప్రాజెక్ట్ ఖరీదులో ప్రభుత్వ రుణం మూడు వంతులు, స్వంత పెట్టుబడి ఒక వంతు ఉంటుంది. వెనకబడిన ప్రాంతాలలో స్థాపించిన పరిశ్రమలకు ఇచ్చిన అప్పుకు పన్నెండు శాతం వడ్డీ వుంటుంది. ఇతర ప్రాంతాలలో పదమూడు శాతం వడ్డీ చెల్లించాలి.

ఈ పథకం కింద మంజూరైన అప్పులకు పూచీగా, అమర్చుకోబోయే పరిశ్రమ ఆస్తులను తనఖా వుంచాలి. మొదటి వాయిదా రుణం మంజూరైన రెండేళ్ళవరకు ఎటువంటి బాకీ చెల్లించనవసరం లేదు. ఈ కాలాన్ని మార

టోరియం అంటారు. ఆ తర్వాత 8 సంవత్సరాలలోపు ప్రతి ఆరునెలలకొక వాయిదా చొప్పున అప్పు తీర్చవలసి వుంటుంది.

## గ్రామోదయ పథకం

దీనినే ప్రస్తుతం సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంట్ స్కీమ్ ఫార్ ఎడ్యుకేటెడ్ అన్ ఎంప్లాయ్‌డ్ యూత్ (SEEUY) అంటున్నారు. ఈ స్కీమ్‌కోసం వచ్చిన దరఖాస్తులను జిల్లా పరిశ్రమల కేంద్రం, బ్యాంకుల ప్రతినిధులు మొదలైనవారున్న కమిటీ చూసి నిర్ణయిస్తుంది. జిల్లా పరిశ్రమల కేంద్రం సహకారంతో బ్యాంకులు పని పూర్తి చేస్తాయి. ఈ పథకాన్ని 1985లో భారత ప్రభుత్వం ప్రారంభించింది. దీనిని ఇప్పుడు పరిశ్రమల శాఖ నిర్వహిస్తోంది. జంట నగరాలకు ఇది వర్తిస్తుంది. ఇందులో పరిశ్రమలకయితే ముప్పై అయిదువేలు, సర్వీస్ యూనిట్‌లకు పాతికవేల, వ్యాపారానికి పదిహేనువేలు ఇస్తారు. ఇందులో ఇరవై అయిదు శాతం భారత ప్రభుత్వం సబ్సిడీగా ఇస్తుంది. ఈ సబ్సిడీని ఫిక్స్‌డ్ డిపాజిట్‌గా వేస్తారు. దీన్ని అప్పు ఆఖరి వాయిదా క్రింద జమకట్టుకుంటారు. ఇందుకు రుణాలు కోరేవారికి ఆదాయ ధృవపత్రం (10 వేల రూ. మించకుండా) మండల రెవిన్యూ అధికారి, పై బ్యాంకువాళ్ళు ఇవ్వాలి. దరఖాస్తును జనరల్ మేనేజర్, జిల్లా పరిశ్రమల కేంద్రం వారికి పంపాలి.

ఈ పథకం కింద 35,000 రూపాయలను పెట్టుబడిదారులతో పాటు మరొకసారి హామీ వున్నప్పుడు మార్జిన్ మనీ లేకుండా ఇస్తుంది. ప్రోత్సాహకులు పరిశ్రమకోసం తీసుకున్న రుణం మొత్తం సొమ్ములో 75 శాతం చెల్లించిన తర్వాత మిగతా 25 శాతం మూలధనం సబ్సిడీగా జమ అవుతుంది. మరోవిధంగా చెప్పాలంటే ఈ పథకంలో అభ్యర్థి పెట్టుబడి ఏమీ ఉండదు. నూరుశాతం అప్పులభిస్తుంది. ఉదాహరణకు 35,000 రూపాయల అప్పులో 8,750 రూపాయలు సబ్సిడీగా లభిస్తుంది. ఆమొత్తం తిరిగి చెల్లించనవసరం లేదు.

దరఖాస్తు వివరాలు : గ్రామోదయ దరఖాస్తు పథకంలో కింది వివరాలు ఉండాలి. 1. అభ్యర్థిపేరు 2. తండ్రి / సంరక్షకునిపేరు 3. పూర్తి చిరునామా 4. పుట్టిన తేదీ, వయసు (సర్టిఫికేట్ జతపరచాలి) 5. సామాజిక హోదా (యస్.సి. యస్.టి, బి.సి., ఇ.బి.సి. సర్టిఫికెట్ జతపరచాలి) 6. అభ్యర్థి కుటుంబ సభ్యుల, పేర్లు ఆదాయం మొదలైన వివరాలు (విడి విడిగా ఇవ్వాలి) మొత్తం ఆస్తి విలువ 7. అభ్యర్థి అతని కుటుంబ సభ్యుల స్థిరాస్తుల వివరాలు(విడివిడిగా ఇవ్వాలి)మొత్తం ఆస్థి విలువ 8. విద్యార్హతలు : సాంకేతిక విద్య / వృత్తి విద్య, అనుభవం, పనిఅనుభవం, శిక్షణ పొందిన కాలం 9. ఆర్.ఆర్.బి/ కో ఆపరేటివ్ / గవర్నమెంట్ డిపార్ట్‌మెంట్ ద్వారా తీసుకున్న

రుణం మొత్తం, తీసుకున్న కారణం, దరఖాస్తు చేస్తున్నప్పటికి తీర్చవలసిన అప్పు 10. ఎన్నుకున్న పరిశ్రమ 11. అప్పు ఇచ్చే బ్యాంకు 12. అవసరమయ్యే పెట్టుబడి 13. ఇతరవివరాలు

ఈ వివరాలు రాసి అభ్యర్థి సంతకం చేసి తేదీ వేయాలి. దీనితోపాటు హామీపత్రం జత చేయాలి. అది ఇలా వుండాలి :

## హామీ పత్రం

"పైన నేను తెలిపిన వివరాలు నిజమైనవని పూర్తి విశ్వాసంతో తెలియ జేస్తున్నాను. నాకు తెలిసినంత వరకు ఇవి నిజమైనవి. వాటిలో ఏమాత్రం అసత్యం వున్నా, వివరాలు నిరాధారమైనవని తేలినా చట్టబద్ధమైన శిక్షకు నేను పాత్రుణ్ని"

ఈ దరఖాస్తుతో పాటు సొంత చిరునామా వున్న స్టాంపులు అంటించిన రెండు కవర్లు జతపరచి పంపాలి.

ఈ పథకం కింద షాపులకు పదిహేను వేల రూపాయలు, వర్క్‌షాపులకు పాతికవేల రూపాయలు, పరిశ్రమకు ముప్పై అయిదువేలు రూపాయలు ఇస్తారు.

## మార్జిన్‌మనీ లోన్ అప్లికేషన్ వివరాలు

1. దరఖాస్తుదారు పేరు (తండ్రి పేరుతో సహా) 2. వాటాదార్ల పేర్లు నివాసం 3. పరిశ్రమ నెలకొల్పే ప్రాంతం 4. వయసు, పుట్టిన తేదీ, స్వస్థలం, కులం (ఎస్.సి./ఎస్.టి./బి.సి. మొ.) 5. విద్యార్హతలు (సంవత్సరాల వారీగా ఉత్తీర్ణత వివరాలు సర్టిఫికేట్ కాపీలతో) 6. సాంకేతిక విద్యార్హతలు (సర్టిఫికేట్ కాపీలతో) 7. పరిశ్రమ స్వభావం మొ. 8. మార్జిన్ మనీకి కావలసిన అప్పు మొత్తం (పథకం పూర్తి వివరాలు) 9. తేదీ లోపల / ఎంతకాలం వరకు అప్పుకావాలి? 10. ఆస్తుల వివరాలు. 11. పూచీ వ్యక్తులు 12. అభ్యర్థి సంతకం 13. ఇద్దరు సాక్షుల సంతకాలు.

అభ్యర్థి వ్యక్తిగత వివరాలు ఈ విధంగా వుండాలి.

1. పరిశ్రమ పేరు, నెలకొల్పే ప్రాంతం 2. అభ్యర్థి పూర్తిపేరు 3. పుట్టిన ఊరు 4. వయస్సు. పుట్టిన తేదీ 5. తండ్రిపేరు 6. శాశ్వత చిరునామా 7. పోస్టల్ అడ్రస్ 8. ఫోన్ నంబరు 9. విద్యార్హతలు (సర్టిఫికేట్లతో) 10. ప్రస్తుత చిరునామా 11. అనుభవం (సర్టిఫికేట్‌లు జతపరచాలి.) 12. ప్రస్తుత వ్యాపకం 13. ఇదివరకు అప్పు తీసుకుని వుంటే ఆ వివరాలు 14. కుటుంబ సభ్యుల వివరాలు 15. ఆరోగ్య వివరాలు 16. బ్యాంకులకు కట్టవలసిన అప్పు మొత్తాలు 17. గతంలో కానీ ఇప్పుడు కానీ ఆసక్తి వున్న

ఇతర పరిశ్రమలు 18. భాగస్తుల వివరాలు 19. కోర్టుకేసులున్నాయా? లేక రాష్ట్ర ఆర్థిక సంస్థకు బకాయి ఉన్నారా? 20. ఆదాయ వివరాలు 21. స్థిరచరాస్థులు 22. నగదు రూపంలో వున్న ఆస్తులు.

ఈవివరాలతోపాటు హామీ పత్రం జత చేసి అభ్యర్థి సంతకం చేయాలి. ప్రతి దరఖాస్తుకు రెండు రూపాయల కోర్టు పీజు బిళ్ల (స్టాంప్) అంటిస్తే చాలు.

## 12. సమగ్ర గ్రామీణ అభివృద్ధి పథకాలు (ఐ.ఆర్.డి.పి.)

గ్రామీణుల ఆర్థికస్థాయిని పెంచేందుకు ఇవి సాయపడతాయి. మండల ప్రజా పరిషత్ ప్రాతిపదికగా ప్రణాళిక తయారుచేసి అందరికీ అందేలా చూస్తారు. బీదవారిని ప్రత్యేకంగా గుర్తించి వారికి ఆర్థిక సహాయం అందిస్తారు. సంవత్సర ఆదాయం రూ. 3500 మించనివారికి సన్నకారు, చిన్నరైతులు, కూలీలు, చేతి వృత్తులవారు అనే వర్గాలుగా విభజించిన్ల సాయం చేస్తారు. రెండున్నర ఎకరాల మాగాణి లేక 5 ఎకరాల పొలం వున్న రైతు సన్నకారురైతు. ఒకటింబాతిక ఎకరం మగాణి లేక రెండున్నర ఎకరాల మెట్టభూమిగలవారు చిన్నరైతులు. సంవత్సరంలో ఆర్నెల్లుమాత్రం పనివున్నవారు వ్యవసాయకూలీలు. వ్యవసాయంలేని ఇతరులు చేతివృత్తులవారు మొ.వారికి పథకంబట్టి సబ్సిడీ, సహాయం ఉంటాయి. గుర్తించిన లబ్దిదారులను గ్రామసభలలో మండల ప్రతినిధి, బ్యాంకు ప్రతినిధి ధృవీకరిస్తారు. వారికి ఇవ్వవలసిన సబ్సిడీ, మార్జిన్‌మనీ, బ్యాంక్ లోన్ నిర్ణయిస్తారు. షెడ్యూల్డ్ కులాలు, తెగలు, వెనుకబడిన తరగతులవారికి మార్జిన్‌మనీలో ఇరవై శాతం సబ్సిడీగా, మిగిలినది బ్యాంకు రుణంగా ఇస్తారు. సబ్సిడీ 3000లకు మించదు.

ఎంపికైన అభ్యర్దుల చేత గ్రామాభివృద్ధి అధికారులు పూర్తి వివరాలతో వున్న డిక్లరేషన్ ఫారం, గ్యారంటీ వగైరాలు పూర్తి చేయించి సంబంధిత బ్యాంకు అధికారుల అనుమతితో జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ (డి.ఆర్.డి.ఏ)కు పంపుతారు. అక్కడ ఆ పత్రాలు పరిశీలించి లబ్దిదారులకు ఇవ్వవలసిన సబ్సిడీ, మార్జిన్‌మనీ వివరాలు బ్యాంకులకు పంపి రుణం మంజూరు చేయిస్తారు.

ఈ పథకంలో వ్యవసాయదారులకు నీటివసతి కల్పిస్తారు. రైతు కూలీలకు గేదెలు, గొర్రెలు, బాతులు, మొదలైనవి ఇస్తారు. వృత్తి పనులవారికి కావలసిన పనిముట్లు, బెస్తవారికి పడవలు ఇస్తారు. శిక్షణ కాలంలో ఉపకారవేతనం వుంటుంది. టైలరింగ్, ఎంబ్రాయిడరీ, అప్పడాల తయారీ, స్క్రీన్ ప్రింటింగ్ మొదలైనవీ ఈ పథకంలోకి వస్తాయి.

# 13. గ్రామాభ్యుదయానికి ట్రైసెమ్ కార్యక్రమం

గ్రామీణ యువతకు స్వయం ఉపాధి శిక్షణనిచ్చే కార్యక్రమం సమగ్ర గ్రామీణ అభివృద్ధి పథకంలో ఒక భాగం. ట్రైసెమ్ అనేది ట్రెయినింగ్ ఆఫ్ రూరల్ యూత్ ఫార్ సెల్ఫ్ ఎంప్లాయిమెంట్ అనే ఇంగ్లీషు పదాల సంక్షిప్త రూపం. దీనిని 1979వ సంవత్సరం ఆగస్టు 15న జాతీయ కార్యక్రమంగా ప్రారంభించారు. జిల్లా గ్రామీణ అభివృద్ధి సంస్థ ఈ కార్యక్రమాన్ని అమలు చేస్తుంది. గ్రామీణ యువతకు నైపుణ్యం పెంచి స్వయం ఉపాధి కల్పించి దారిద్ర్యం తొలగించడం దీని ముఖ్యమైన ఉద్దేశ్యం. ఇందుకు అర్హులైన వారిని జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ, జిల్లా పరిశ్రమల కేంద్రం, మండల అభివృద్ధి అధికారులు ఉన్న అధికార బృందం ఎన్నిక చేస్తుంది.

**ఇందుకు కావలసిన అర్హతలు :**

అభ్యర్థి కేవలం గ్రామీణ ప్రాంతంలో నివసిస్తూ వుండాలి. దారిద్ర్యరేఖకు అడుగున వున్న కుటుంబాలవారే అర్హులు. వృత్తి పనివారికే ప్రాముఖ్యం వుంటుంది. షెడ్యూల్డ్ కులాల, జాతులు వారికే, స్త్రీలకు ప్రాముఖ్యం. వయస్సు 18-35 సంవత్సరాల మధ్య వుండాలి. కొన్ని పనులకు విద్యతో పనిలేదు. కొన్నింటికి 8వ తరగతి, కొన్నిటికి 10వ తరగతి పాసై వుంటే చాలు (వివరాలు అనుబంధంలో వున్నాయి)

ఇందులో శిక్షణ మూడు విధాలు. అభ్యర్థులకు సొంత గ్రామంలో శిక్షణ ఇవ్వడం మొదటి విధం. ఇందులో శిక్షణ ఏర్పాటుకు కావలసిన వసతి సదుపాయాలు గ్రామస్తులు ఏర్పాటు చేయాలి. నెల జీతం మీద శిక్షకుని నియమిస్తారు. ఈవిధమైన శిక్షణ తుంగ చాపల అల్లకం, కలంకారీ అద్దకం మొదలైన వాటికి పరిమితం. శిక్షణకు భారీ ఎత్తున యంత్రాలు, ఇతర పరికరాలు అవసరమైతే అభ్యర్థులను ఆ చోటకు పంపి శిక్షణ ఇవ్వడం మరో పద్ధతి. నిపుణుల దగ్గరికి పంపి శిక్షణ ఇప్పించడం మూడవ పద్ధతి. ప్రాంతీయ అవసరాలకు తగినట్లుగా వివిధ రకాల శిక్షణ ఏర్పాటు చేయవచ్చు.

అభ్యర్థికి స్వగ్రామంలో అయితే 75 రూపాయలు, వేరేచోట అయితే రూ.200 చొప్పున నెలకు ఉపకారవేతనం ఇస్తారు. శిక్షకునికి ఒక్కొక్క అభ్యర్థికి 50 రూపాయలు మించకుండా శిక్షణ ఖర్చులు చెల్లిస్తారు. ముడి సరుకులు కొనేందుకు నెలకు ఒక్కొక్క అభ్యర్థికి పాతిక రూపాయలు చొప్పున శిక్షకులకు చెల్లిస్తారు. ఈ మొత్తం రెండువందలకు మించకూడదు. శిక్షణను జయప్రదంగా పూర్తి చేసిన అభ్యర్థికి అయిదువందల రూపాయలకు మించకుండా చేతి పరికరాలు ఉచితంగా ఇస్తారు. ఇతర వివరాలు జిల్లా గ్రామీణ అభివృద్ధి సంస్థవారు తెలియచేస్తారు.

## 14. జిల్లా గ్రామీణ అభివృద్ధి సంస్థ
## (డిస్ట్రిక్ట్ రూరల్ డెవలప్‌మెంట్ అథారిటీ ఐ.ఆర్.డి.ఎ) పథకాలు

వివిధజిల్లాలలో అనేక పథకాలకు ఈ సంస్థ సాయం చేస్తుంది. ముఖ్యంగా వ్యవసాయం, చిన్ననీటి వనరులు, పళ్ళతోటల పెంపకం, పశుపోషణ, చేపల పెంపకం, చేతి పరిశ్రమ మొ. స్కీముల మొత్తం విలువలో సుమారు మూడవ వంతు సబ్సిడిగా ఇస్తుంది. మిగిలిన సొమ్ము బ్యాంకులు, ఇతర ఆర్థిక సంస్థలు ఇస్తాయి. మండల ప్రజాపరిషత్తు, జిల్లా గ్రామీణ అభివృద్ధి సంస్థ వివరాలను అందజేస్తాయి. గ్రామాలలో నిరుద్యోగ నిర్మూలనకు, సమగ్ర గ్రామ వికాసానికి ఈ సంస్థ ఎంతో కృషి చేస్తుంది. (ఇతర పథకాల పేర్లకు అనుబంధం చూడండి)

ఇలాగే గ్రామీణులకు రుణాలిచ్చే జాతీయ బ్యాంకు నాబార్డు వారి పథకాలు కూడా వున్నాయి. వీటికి దరఖాస్తు చేసుకునేవారు సంస్థ పేరు, ఏ ప్రదేశం, పారిశ్రామిక లైసెన్స్ నెంబర్, సొంతదారు భాగస్వాముల పేర్లు, వయస్సు, సాంకేతిక పరిజ్ఞానం, అనుభవం, ఫర్నిచర్, కుటుంబ వివరాలు, కావలసిన పని వారి సంఖ్య, మూలధనం, రుణం, ఆర్థిక వనరులు, మొత్తం ప్రాజెక్టుకు కావలసిన రుణం మొదలైన వివరాలు ఇవ్వాలి. ఇదేవిధంగా గ్రామాలలోనూ, పట్టణాలలోను యస్.సి., యస్.టి., వెనుకబడిన జాతుల వారికి నెహ్రూరోజ్‌గార్ పథకం తోడ్పడుతుంది. ఇందులో అభ్యర్థులకు 18-35 సంవత్సరాల వయస్సు, 7300 రూపాయలలోపు వార్షిక ఆదాయం ఉండాలి. ఇరవై వేల రూపాయలదాకా ఆర్థిక సహాయం లభిస్తుంది. వివరాలు జిల్లా పరిశ్రమల శాఖలో సంప్రదిస్తే తెలుస్తాయి. వీటికి తోడు ప్రతిజిల్లాలో శిక్షణ, స్వయం ఉపాధి కల్పనా సంస్థలున్నాయి. అవికూడా మంచి సహాయాన్ని అందిస్తాయి.

ఈ విధంగా ఎన్నోరకాల స్కీములున్నాయి. వాటిని సద్వినియోగం చేసుకుని మనం బాగుపడి దేశాన్ని బాగుచేద్దాం.

## 15. బలహీన వర్గాలకు ప్రత్యేక సౌకర్యాలు
## (యస్.సి., యస్.టి. వారికి)

1. ప్రత్యేక పారిశ్రామిక వాడలు నిర్మించడం జరిగింది.
2. ప్రత్యేక శిక్షణ, ప్రాజెక్ట్ తయారీలో తోడ్పాటు ఇస్తున్నారు.
3. ప్రత్యేక సబ్సిడీ (25 శాతం లేక 5 లక్షలలోపు) ఇస్తున్నారు
4. భవనాలు, భూమి కొనుగోలు వగైరాలకు 10% ప్రత్యేక సబ్సిడీ ఇస్తున్నారు.
5. లక్ష రూపాయలలోపు రుణాలపై 5 సం. వరకు 6శాతం మాత్రమే వడ్డీ వసూలు చేస్తున్నారు.

6. సేల్స్‌టాక్స్ 50,000 రూపాయల వరకు తిరిగి చెల్లిస్తారు.

7. 3 సం.ల వరకు ఇరవై అయిదుశాతం సబ్సిడీ చెల్లిస్తారు.

8. 2 లక్షల ప్రత్యేక సీడ్ కాపిటల్ ఒక్కశాతం వడ్డీతో రుణంగా ఇస్తారు.

9. కేవలం అయిదుశాతం మార్జిన్‌తో పరిశ్రమ ఏర్పాటు చేసుకోవచ్చు.

ఈ సౌకర్యాలను బలహీన వర్గాలవారు సద్వినియోగం చేసుకుని దేశాభివృద్ధి కార్యక్రమంలో భాగస్వాములు కావాలి.

## 16. చిన్న పరిశ్రమలకు మార్కెటింగ్ సహాయం

చిన్న పరిశ్రమలు ఉత్పత్తి చేసిన వస్తువులను అమ్ముకోడానికి ప్రభుత్వపరంగా సహాకారం లభిస్తుంది. ఇందుకు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు ఎన్నో సౌకర్యాలు కల్పించాయి.

**రాష్ట్ర ప్రభుత్వం కల్పించిన సౌకర్యాలు :**

1. ఎర్నెస్ట్ మనీ డిపాజిట్, సెక్యూరిటీ డిపాజిట్ కట్టనక్కర్లేదు. ధరలు నిర్ణయించడంలో స్వాతంత్ర్యం వుంటుంది.
2. అన్ని ప్రభుత్వశాఖలు, పబ్లిక్ సెక్టర్ (ప్రభుత్వ రంగ) సంస్థలు, రాష్ట్ర కార్పొరేషన్‌లు, జిల్లా పరిషత్, మండలాలు, పంచాయితీలు, మునిసిపాలిటీలు మొదలైనవన్నీ తమకు కావలసిన వస్తువులన్నిటినీ స్థానిక చిన్న పరిశ్రమలనుండే కొనుక్కోవాలి. (మెమొరాండమ్ నెం.6431/D-67-1 ఇండస్ట్రీస్ డిపార్ట్‌మెంట్, ఆం.ప్ర. తేదీ 8.1.68, జి.ఓ. ఎమ్.ఎస్.నెం.1020, ఇండస్ట్రీస్ & కామర్స్ డిపార్ట్‌మెంట్ తేదీ 30.11.76 ప్రకారం)

అ) దిగుమతి చేసుకునే వస్తువులకన్నా దేశీయ ఉత్పత్తులకు 15% ప్రైస్ ప్రిఫరెన్స్ (ధరలో ఎంపిక) ఇవ్వాలి.

ఆ) రాష్ట్రంలోని తయారైన వస్తువులకు దేశీయ ఉత్పత్తులకన్నా 5% ప్రైస్ ప్రిఫరెన్స్ ఇవ్వాలి.

ఇ) చిన్న పరిశ్రమలకు, కుటీర పరిశ్రమలకు 10% ప్రైస్ ప్రిఫరెన్స్ ఇవ్వాలి.

ఈ) సహాకార సంస్థల ఉత్పత్తులకు ఇతర వాటిపై 5% అదనంగా ప్రైస్ ప్రిఫరెన్స్ ఇవ్వాలి.

ఉ) ఐ.యస్.ఐ. గుర్తు వున్న రాష్ట్రీయ ఉత్పత్తులకు 2% ప్రైస్ ప్రిఫరెన్స్ ఇవ్వాలి.

దీనితోపాటు రాష్ట్రప్రభుత్వం 384 వస్తువులను కేవలం చిన్న పరిశ్రమల నుండే కొనాలనే నిర్ణయం తీసుకుంది (జి.ఓ.ఎమ్.ఎస్. నెం.437, ఇండస్ట్రీస్

అండ్ కామర్స్ డిపార్ట్‌మెంట్ (SSI) తే. 5.8.1983) దీనికి తోడు 11 వస్తువులను ప్రత్యేకించి 75 శాతం వరకూ, మరో 15 వస్తువులను 50 శాతం వరకూ ప్రభుత్వం కచ్చితంగా చిన్న పరిశ్రమలనుండే కొనాలి.

అమ్మకంపన్ను మొదలైన రాయితీలు కూడా వున్నాయి. ఉదాహరణకు సింగరేణి కాలరీస్, ఆర్టీసీ, డైరీ డెవలప్‌మెంట్ కో ఆపరేటివ్ ఫెడరేషన్, రాష్ట్ర విద్యుత్ బోర్డులు వస్తువులు కొనేటప్పుడు చిన్నపరిశ్రమలపై పన్ను భారం పడదు. ఆ భారం రాష్ట్ర ప్రభుత్వమే భరిస్తుంది. (జి.ఓ.ఎమ్.ఎస్. నెం.406, ఇండస్ట్రీస్ & కామర్స్ డిపార్ట్‌మెంట్ (IA) తే. 11.9.90)

## నేషనల్ స్మాల్ ఇండస్ట్రీస్ కార్పోరేషన్ లిమిటెడ్ (NSIC) కల్పించిన సౌకర్యాలు :

చిన్న పరిశ్రమలను ప్రోత్సహించేందుకై ఏర్పడ్డ ప్రభుత్వ కొనుగోలు సంస్థ ఇది. గుర్తించిన 409 వస్తువులను కేవలం చిన్న పరిశ్రమలనుండే కొనాలని ఈ సంస్థ ఆదేశించింది. దీనితోపాటు మరో పదమూడు వస్తువులు 75% వరకు, ఇరవై తొమ్మిది వస్తువులు 50% వరకు చిన్నపరిశ్రమల రంగం నుండే కొనాలని నిర్ణయించింది. ఈ సంస్థ 1955 ఫిబ్రవరిలో ఏర్పడింది. ఈ సంస్థ నమోదు చేసుకున్న చిన్న పరిశ్రమలు ప్రభుత్వ టెండర్లలో పాల్గొనవచ్చు. వీరికి ధరలో ఎంపిక డిపాజిట్‌లలో 15 శాతం మినహాయింపు వుంటుంది. వీరికి టెండర్ ఫారాలు ఉచితంగా ఇవ్వడం, సెక్యూరిటీ డిపాజిట్ అవసరం లేకపోవడం మొదలైన మినహాయింపులు ఉంటాయి.

ఇందుకు చిన్న పరిశ్రమలు సింగిల్ పాయింట్ రిజిస్ట్రేషన్ చేసుకోవలసి వుంటుంది. దీనికి NSIC కి దరఖాస్తు పెట్టుకోవాలి. ఒకసారి రిజిస్ట్రేషన్ కనీసం 2 సం.పాటు చెల్లుతుంది. తర్వాత అప్పుడప్పుడూ దానిని పునరుద్ధరించుకోవాలి. వీరికి కావలసిన భారీసామగ్రి వగైరాలు వాయిదా పద్ధతిలో కొనుక్కునేందుకు కూడా ప్రభుత్వం తోడ్పడుతుంది. ఇందుకు కావలసిన దరఖాస్తులు రెండు లక్షలలోపు విలువచేసే స్వదేశీ యంత్రాలకోసం అయితే 5 రూపాయలకు, అంతకు మించిన స్వదేశీ, విదేశీ యంత్రాలకోసం అయితే 10 రూపాయలకు దొరుకుతుంది. ఈ దరఖాస్తులు మూడు ప్రతులు NSIC హైద్రాబాద్‌కు కానీ, SISI బాలానగర్ హైద్రాబాద్‌కు కానీ పంపవచ్చు. వారు కమిషనర్ ఆఫ్ ఇండస్ట్రీస్‌కు లేక జిల్లా పరిశ్రమల కేంద్రం జనరల్ మేనేజర్‌కు వాటికాపీలు పంపుతారు.

అప్లికేషన్‌ల ఖరీదు, వడ్డీరేటు, డిపాజిట్‌లు, సర్వీస్ ఛార్జీలు మొ.నవి యంత్రాల ఖరీదు, ప్రదేశం, ఔత్సాహికుల స్థాయిని బట్టి మారుతాయి. పూర్తి వివరాలకు క్రింది అడ్రస్‌కు రాయవచ్చు.

నేషనల్ స్మాల్ ఇండస్ట్రీస్ కార్పోరేషన్ లి.
203, దత్తసాయి కాంప్లెక్స్
సప్తగిరి థియేటర్ ఎదురుగా
ఆర్.టి.సి. క్రాస్‌రోడ్స్
హైదరాబాద్ ఫోన్ : 67376.

## 17. మహిళా పారిశ్రామికులకు స్వయం ఉపాధి అవకాశాలు

మహిళకు మానవజాతి మొత్తం రుణపడి వుంటుంది. కారణాలు అందరికీ తెలిసినవే. మానవజాతి మనుగడకే ప్రాణం పోసింది మగువ. త్యాగంలో అను రాగంలో తరగని పెన్నిధి మగువ అన్నారు ఒక సినీకవి. ఈ రోజుల్లో ఆడామగా ఇద్దరూ పనిచేస్తే కానీ ఇల్లు గడవడంలేదు. అందువల్ల ఎవరికి చేతనైనంత వారు పనిచేయక తప్పడంలేదు. ఆడవాళ్ళు తలచుకుంటే ఏమైనా చేయగలరు అనేందుకు ఇటీవలి సారా వ్యతిరేక ఉద్యమం ఒక చక్కని ఉదాహరణ. లిజ్జత్ పాపడ్ సంస్థ గురించి ఇంతకుముందే తెలుసుకున్నాం. పట్టణాలలో, నగరాలలో ఎంతోమంది స్త్రీలు ఉద్యోగాలు చేస్తున్నారు. మరెంతోమంది శ్రమజీవనం సాగి స్తున్నారు. కూలీలుగా, ఇంటి పనిమనుషులుగా, ఇంకామరెన్నో రకాలుగా కృషి చేస్తున్నారు. ఈ విధంగా నిత్యజీవితంలో ఎందరో మహిళలు సంపాదిస్తూ కుటుంబ ఆదాయాన్ని పెంచుతున్నారు. కొన్నిచోట్ల కుటుంబానికే మూలస్థం భంగా నిలుస్తున్నారు. అయితే పల్లెల్లో, మారుమూల ప్రాంతాల్లో ఎంతోమంది మహిళలు ఎటువంటి పరిజ్ఞానంలేక దాదాపు బానిసలుగా జీవిస్తున్నారు. ఇటు వంటి మహిళలకు ఒక దారిచూపి వారి భవిష్యత్తుకు బంగారు బాట వేసేం దుకు ప్రభుత్వ సంస్థలు, బ్యాంకులు, సేవాసంస్థలు ఎంతో కృషి చేస్తున్నాయి. ఇటువంటి సహాయం వుందని తెలియనివారు ఎంతోమంది వున్నారు. వారికి ఉపయోగపడే సమాచారం గురించి తెలుసుకుందాం.

### ప్రభుత్వ సంస్థలు - సహాయ పథకాలు

ఈనాడు మహిళలు అన్నిరంగాలలోనూ విజృంభిస్తున్నారు. పారిశ్రామిక రంగంలో కూడా అద్భుత ప్రగతి సాధిస్తున్నారు. ఇందుకు ఎన్నో ప్రభుత్వ సంస్థలు కూడా చేయూతనిస్తున్నాయి. అటువంటివాటిలో ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫైనాన్షియల్ కార్పోరేషన్, ఆంధ్రప్రదేశ్ విమెన్స్ యూత్ కార్పోరేషన్, సెట్‌విన్, ఖాదీ గ్రామోద్యోగ్ బోర్డ్ వున్నాయి.

1. **ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫైనాన్షియల్ కార్పోరేషన్ :** ఔత్సాహికులకు ఆర్థి కపరంగా ఊపిరి పోసే సంస్థ. ఇప్పటికే వేలాది సంఖ్యలో పారిశ్రామిక సంస్థలకు ఈ సంస్థ ఆర్థికంగా చేయూత నిచ్చింది. దీనికి 23 జిల్లాలలోనూ

శాఖలున్నాయి. భూమి, భవనాలు, యంత్రపరికరాలు మొదలైనవి కొను క్కోడానికి టర్మ్‌లోన్ రూపంతో పదివేలనుండి అరవైలక్షలదాకా రుణాలు అందిస్తుంది. ఈ అప్పును తేలిక వాయిదాలలో తీర్చవచ్చు. ఔత్సాహికులు ముందుకువస్తే యూనిట్‌ను స్థాపించే ప్రారంభదశనుండి పనిచేసే దశ మొదలయ్యేవరకు నిపుణుల సహాయం ఉచితం. ఫుడ్ ప్రిజర్వేషన్ (ఆహార పదార్థాలు చెడిపోకుండా నిలువ వుంచడం), ప్రాసెసింగ్ (డబ్బాలలో, సీసా లలో ఆహారపదార్థాలు సురక్షితంగా నింపడం), హోటల్, వస్తువుల రవాణా, యంత్రాలు, విద్యుత్ ప్యాకింగ్, నర్సింగ్‌హోమ్ పరికరాల కొనుగోలు, నిర్వ హణ, అకౌంటెన్సీ, మెడిసిన్, గృహనిర్మాణ రూపకల్పన (ఆర్కిటెక్చర్) ఇంజనీరింగ్ రంగాలలో నిపుణులైన వారు నడిపే సంస్థలకు ఈ సంస్థ రుణాలు ఇస్తుంది. అయితే వర్కింగ్ కాపిటల్ (పనిజరిగేందుకు పెట్టు బడి) కు మాత్రం రుణం ఇవ్వదు. స్వయం ఉపాధి పథకాలలో లఘు (లేక) చిన్న పారిశ్రామిక (లేక) సర్వీస్ రంగాలలోని కొత్త పారిశ్రామిక సంస్థలకు ప్రాజెక్ట్‌లో 20 శాతం లేక 50,000 రూపాయలు, ఏది తక్కు వైతే అది మార్జిన్‌మనీగా ఇస్తుంది. ఈ పథకాల వర్కింగ్ కాపిటల్, స్థిరాస్థులు అన్నీ కలిసి ప్రాజెక్ట్‌కాస్ట్ (ఖరీదు) 5 లక్షలు మించకూడదు. రుణాన్ని మొదట రెండేళ్ళ మారటోరియంతో 8 సంవత్సరాలకాలంలో తీర్చాలి. స్త్రీలు కూడా అర్హులే.

మహిళలకు ప్రత్యేకంగా మహిళోదయ పథకం వుంది. ఇందులో 10 లక్షలు మించని ప్రాజెక్ట్ కాస్ట్‌తో 51% షేర్ ఈక్విటీతో ప్రారంభించే కొత్త యూని ట్‌లకు ప్రాజెక్ట్ కాస్ట్‌లో 15% ఈక్విటీ సాయంగా పొందే వీలుంది. నిజానికి ఇందులో మహిళలు పెట్టవలసిన వాటామొత్తంలో 10% మాత్రమే. 75% స్టేట్ ఫైనాన్షియల్ కార్పోరేషన్ వారు ఇస్తారు. 15% వడ్డీ లేకుండా కేవలం 1% సర్వీస్ ఛార్జీ వసూలు చేసే సాఫ్ట్‌లోన్‌గా వస్తుంది. ఈ రుణాలను స్టేట్ ఫైనాన్షియల్ కార్పోరేషన్ బ్రాంచి మేనేజర్‌లే మంజూరు చేయవచ్చు. ప్రాజెక్ట్ 7.5 లక్షలకు మించితే ఆ సంస్థ ప్రధాన కార్యాలయం (హైదరాబాద్) వారు మంజూరు చేయాల్సి వుంటుంది. లఘు, మధ్య తరహా రంగాలలో 3 కోట్లకు మించని ప్రాజెక్ట్ కాస్ట్‌తో యూనిట్ పెట్టినందుకు రుణాలు పొందవచ్చు. అలాగే చిన్న గ్రామీణ పరిశ్రమలు, లఘు, మధ్య తరగతి రంగాలలోని యూనిట్‌ల ఆధునీకరణకు రుణాలు పొందవచ్చు.

అతిచిన్న (టైనీ), లఘు (స్మాల్) పరిశ్రమలలో పలువస్తువుల తయారీ, నిలువ, ప్రాసెసింగ్, సర్వీసింగ్ యూనిట్ స్థాపనకు లక్షన్నరకు మించని విధంగా ప్రాజెక్ట్ కాస్ట్‌లో గరిష్టంగా 15% వరకు నేషనల్ ఈక్విటీ కింద 1% సర్వీస్ ఛార్జీతో రుణాలు లభిస్తాయి.

హామీగా స్థిరాస్తులు తనఖాపెట్టాలి. కొన్ని సందర్భాలలో యూనిట్‌నిబట్టి

సంయుక్త హామీ ఇవ్వవలసి వుంటుంది.

వడ్డీరేటు లఘు పరిశ్రమల రంగంలో టర్మ్‌లోన్‌పై 25 వేల లోపు 11.9 శాతం, ఆపైన 2 లక్షల వరకు 15.7 శాతం వుంటుంది.

మహిళోదయ నిధి పథకాలలో రుణం తీర్చేందుకు 10 సంవత్సరాలు గరిష్ట పరిమితి. ఇందులో 5 సంవత్సరాలు మారటోరియం. ఈ కాలంలో రుణం తీర్చనక్కర్లేదు.

స్వయం ఉపాధి పథకాలలో గరిష్టకాలం 8 సంవత్సరాలు. మారటోరియం 2 సంవత్సరాలు.

ఈ పథకం కింద మహిళలు మిఠాయి తయారీ, రెడీమేడ్ దుస్తులు, ప్రింటెడ్ సర్క్యూట్ బోర్డులు, అల్యూమినియం పాత్రలు, మొదలైనవి తయారుచేయడం, వీడియోకాసెట్ డూప్లికేషన్, బ్రెడ్ తయారీ మొదలైనవి చేపట్టవచ్చు. వీటికి వర్కింగ్ క్యాపిటల్‌ను వివిధ బ్యాంకులు ఇస్తాయి. దరఖాస్తు (అప్లికేషన్) ఫారాలు సంస్థ శాఖ కార్యాలయాలలో వుంటాయి. దానితోపాటు ప్రాంతం వివరాలు, షెడ్ కేటాయింపు ఉత్తర్వు, భూమి లీజుకు తీసుకుని వుంటే ఆ పత్రం (30సం.ల లీజ్‌డీడ్), భవనాల ప్లాన్, నిర్మాణ వ్యయం అంచనాలు (ఎస్టిమేట్స్), పరికరాల పట్టిక, కొటేషన్‌లు, విద్యుత్ వివరాలు, ముడిపదార్థాల ఏర్పాటు, మానవవనరుల వివరాలు, వారి జీతభత్యాల అంచనాలు, మార్కెట్‌సర్వే, ప్రమోటర్‌ల బయోడేటా, వృత్తి అనుభవ వివరాలు, లఘు పరిశ్రమల రిజిస్ట్రేషన్ నెంబర్, లైసెన్స్ వివరాలు జతచేయాలి.

ఇంకా వివరాలు కావలసినవారు ఎంటరుప్రెన్యూర్స్ గైడెన్స్ & డెవలప్‌మెంట్ డిపార్ట్‌మెంట్, ఆంధ్రప్రదేశ్ ఫైనాన్షియల్ కార్పొరేషన్, 5-9-194 చిరాగ్‌అలీ లేన్, హైదరాబాద్-500 001 అనే అడ్రస్‌కు రాసి తెలుసుకోవచ్చు.

2. **ఆంధ్రప్రదేశ్ విమెన్స్ కోఆపరేటివ్ ఫైనాన్షియల్ కార్పోరేషన్ :** 1975వ సంవత్సరంలో అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా ఆవిర్భవించిన ఈ సంస్థ కేవలం మహిళలకు మాత్రమే సాయం చేస్తుంది. ఎక్కువ ఉపాధి అవకాశాలున్న అగ్రో (వ్యవసాయ సంబంధమైన) పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు, గ్రామీణ పరిశ్రమలు, లఘుపరిశ్రమలు మొదలైన వాటిలో సలహాలు, సహాయం అందిస్తుంది. ప్రాజెక్ట్‌కాస్ట్‌లో ఇరవైశాతం మార్జిన్‌మనీగా ప్రతి మహిళకూ ఇస్తుంది. మిగిలిన మొత్తం జాతీయబ్యాంకులు, గ్రామీణ బ్యాంకులు, సహకార పరపతి సంఘాలు వగైరాలనుండి పొందాలి.

పాడిపశువుల పెంపడం, కోళ్ళ పరిశ్రమ, కుట్టుమిషన్‌లు, కిరాణా, కట్‌పీస్ క్లాత్, రెడీమేడ్ బట్టలు, కూరగాయల అమ్మకం, కొబ్బరికాయలు, శికాయపొడి, కాఫీపొడి, గాజులు, స్టీలుపాత్రలు వగైరా అమ్మకాలకు ఈ సంస్థ మార్జిన్‌మనీ

సమకూర్చుతుంది.

11 రూపాయల షేర్ కాపిటల్ రుసుంతో కార్పోరేషన్ సభ్యత్వం తీసుకోవాలి. జిల్లా మహిళా సంక్షేమాధికారిణి కార్యాలయంలో దరఖాస్తు తీసుకోవచ్చు. దానిని నింపి, ఇద్దరు హామీదార్లతో సంతకాలు చేయించి, స్థానిక జాతీయబ్యాంక్ లేక గ్రామీణబ్యాంక్ లేక జిల్లా సహకార బ్యాంక్ మేనేజర్‌ను కలవాలి. మహిళా ఆర్థిక సంస్థ వారు మార్జిన్‌మనీ 20 శాతం ఇచ్చిన పక్షంలో తాము రుణం ఇస్తామని వారిచేత సూత్రప్రాయ అంగీకార ఉత్తరం తీసుకుని దానిని విస్తరణాధికారి (ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్)కు ఇవ్వాలి. దానిని మండల అభివృద్ధి అధికారి (MDO) సిఫార్సుతో జిల్లా మహిళా సంక్షేమాధికారిణికి పంపు తారు. కలెక్టర్ అధ్యక్షతన వుంటే జిల్లాస్థాయి సంఘానికి ఆ దరఖాస్తును ఇవ్వాలి. కలెక్టర్‌గారు అంగీకరిస్తే మార్జిన్‌మనీపోగా మిగిలిన రుణం ఇమ్మని బ్యాంక్‌కు రాస్తారు. బ్యాంకు ఆ రుణం ఇస్తే కార్పోరేషన్ మార్జిన్ మనీ ఇస్తుంది. రెండూ కలిపి బ్యాంక్‌వారు ఇస్తారు.

మార్జిన్‌మనీపై సాలుకు $6\frac{1}{2}$ శాతం వడ్డీ. దానిని ఏడాదిలోపు తీర్చాలి. బ్యాంక్ రుణాలు డి.ఐ.ఆర్ పద్ధతిలో అయితే 4.25 శాతం, లేకుంటే 15-19 శాతం వడ్డీ చెల్లించాలి.

రుణం దేనికి తీసుకుంటే దానికే వాడుకోవాలి. ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రి యల్ అండ్ టెక్నికల్ కన్సల్టెన్సీ ఆర్గనైజేషన్ లిమిటెడ్ (APITCO) వారు దీనికి సంబంధించిన శిక్షణ కార్యక్రమాలు నిర్వహిస్తారు. ఇందులో పాల్గొని మహిళలు ఎన్నో ప్రయోజనాలు పొందవచ్చు.

1992వ సంవత్సరం మార్చి 14నుండి నెలరోజులపాటు స్త్రీ మేళా - 92 కార్యక్రమం హైద్రాబాద్‌లో జరిగింది. అది స్త్రీశక్తికి నిదర్శనం. అందులో వివిధ అలంకరణ వస్తువులు, వెదురు ఉత్పత్తులు, పట్టు, నేత ఉత్పత్తులు, బేకరీ ఉత్పత్తులు, హస్తకళలు, నవారు, రెడీమేడ్ బట్టలు, ప్రిజర్వ్‌డ్ ఫుడ్ వగైరాలు ఆడవారి పనితనానికి సంకేతాలుగా నిలిచాయి. వారికి చేసే సహాయం వృథాకాదని నిరూపించాయి.

3. **స్టైప్, సెట్‌విన్ :** ఒక్కో జిల్లా పరిధిలో ఒక్కో స్టైప్, జంటనగరాల్లో సెట్‌విన్ పథకాలున్నాయి. పథకాలు పారిశ్రామిక, వ్యాపార, సేవా రంగాలకు సంబంధించి వున్నాయి. వీటిలో మొదటి రంగంలో స్టేట్ ఫైనాన్సియల్ కార్పోరేషన్ వారిది ప్రధాన బాధ్యత. వ్యాపారరంగంలో మార్కెట్ అవకాశాలనుబట్టి ఆర్థిక మద్దతు అందించే బ్యాంకుల సహకా రంతో తగిన పథకాలు స్టైప్, సెట్‌విన్‌లే రూపొందిస్తున్నాయి. అవసరాలు పెరుగుతున్నందువల్ల అన్ని రంగాలలోసేవల అవసరం పెరిగింది. ఇందుకు సంబంధించిన పథకాలు స్థానిక ఆర్థిక సంస్థలు బ్యాంకులతో చర్చించి ఆయా

జిల్లా సంఘాలు రూపొందిస్తాయి.

ఆంధ్రప్రదేశ్ ప్రొడక్టివిటీ కౌన్సిల్ వారు పై మూడు రంగాలలోనూ స్వయం ఉపాధి పథకాల ప్రాజెక్టులను రూపొందించారు. వీటిని స్టెప్, సెట్ విన్‌ల నుండి పొందవచ్చు.

జెమ్‌క్లిప్స్, హవాయి చెప్పులు, ప్లాస్టిక్ వస్తువులు, కూల్‌డ్రింక్ స్ట్రాలు, రెక్సిన్ వస్తువులు, టి.వి.క్యాబినెట్‌లు, టి.వి. స్టాండ్‌లు, అయొడైజ్డ్ ఉప్పు, కాసెట్‌లు, పిండిమరలు, మొబైల్ క్యాంటీన్‌లు మొదలైన వాటికి రుణాలు లభిస్తాయి.

ఇందుకు పారిశ్రామిక రంగాలలో ఐ.టి.ఐ. లేక మెట్రిక్ కనీస విద్యార్హత. షెడ్యూల్డ్ కులాలు, జాతుల వారికి ఎనిమిదవ తరగతి చాలు. వయసు 18 - 40 సంవత్సరాలుండాలి. యస్.సి., యస్.టి. లకు 5 సంవత్సరాల సడలింపు వుంటుంది. తల్లిదండ్రుల సంవత్సర ఆదాయం పన్నెండువేల రూపాయలకు మించకూడదు.

మార్జిన్‌మనీ విషయంలో పారిశ్రామిక రంగంలో ప్రాజెక్టు కాస్ట్ 5 లక్షల వరకూ వుండవచ్చు. దానికి మార్జిన్‌మనీ 50 వేలకు మించకుండా ఇరవై శాతం ఇస్తారు. వ్యాపారరంగం స్కీమ్‌లో ఇరవై శాతం లేక గరిష్టం ఇరవై అయిదువేలు ఇస్తారు.

వృత్తి నైపుణ్యం వున్న వారికి వేరుగా పాతికవేల దాకా ప్రాజెక్ట్ కాస్ట్‌వి పథకాలపై సహాయం అందిస్తారు. పదివేలకు మించని ప్రాజెక్ట్ కాస్ట్ పథకాలపై యాభైశాతం మార్జిన్‌మనీ ఇస్తారు. పదివేలు నుండి ఇరవై అయిదువేల వరకున్న పథకాలకు అయిదువేలు మాత్రమే ఇస్తారు.

ఈ రుణాలు పొందే లబ్దిదారుల ఎంపికకు ఒక కమిటీ వుంటుంది. ఇందులో ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసర్, జిల్లా పరిశ్రమలకేంద్రం జనరల్ మేనేజర్, సాంఘిక సంక్షేమ అధికారి, లీడ్ బ్యాంక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్, కలెక్టర్ సభ్యులుగా వుంటారు. జిల్లా కలెక్టరే దీనికి అధ్యక్షుడుగా, సమావేశకర్తగా వ్యవహరిస్తారు.

4. **ఖాదీ గ్రామోద్యోగ బోర్డ్ :** గ్రామీణ మహిళలకు ప్రత్యేకంగా సాయం అందించేందుకు ఈ సంస్థ 1957లో ఏర్పడింది. ఇది కేంద్రస్థాయి సంస్థ. దీని పరిధిలో వివిధ రాష్ట్రాల బోర్డులున్నాయి. మన రాష్ట్రంలో కూడా హైదరాబాద్

కేంద్రంగా ఈ బోర్డు వుంది. తమ పరిధిలోని 55 పరిశ్రమలకు ఈ సంస్థ అర్థిక సహాయం అందిస్తుంది. ఖాదీసిల్క్, వంటనూనెలుకాని ఇతర నూనెలు, డిటర్జెంట్ బిళ్లలు, ఫుడ్ ప్రాసెసింగ్, కర్పూరం, కొవ్వొత్తులు, అప్పడాలు, మసాలాలు, చేతితో చేసిన కాగితం, అగ్గిపెట్టెలు, అగరుబత్తి, పీచు ఉత్పత్తులు, టైలరింగ్, దుస్తులతయారీ మొదలైన పథకాలకు ఈ సంస్థ రుణాలిస్తుంది.

నిరక్షరాస్యులైన మహిళలైనా వ్యక్తిగతంగా కానీ, ఒక బృందంగా కానీ రుణసాయం పొందవచ్చు. వడ్రంగం మొదలైన సాంప్రదాయికమైన వృత్తులలో వున్నవారు, ఐ.టి.ఐ వగైరా పాసైనవారు కూడా అర్హులే. నిర్ణీతమైన ఫారంలో సంబంధిత జిల్లా అభివృద్ధి అధికారికి (ఖాదీ గ్రామీణ పరిశ్రమల బోర్డు) దరఖాస్తు చేసుకోవాలి. దీనికి సంబంధించిన ప్రకటనలు స్థానిక పత్రికలలో వస్తాయి.

జిల్లా కలెక్టర్ అధ్యక్షతన జిల్లాస్థాయి సంఘం దరఖాస్తుదార్లను ఇంటర్వ్యూ చేస్తుంది. ఇంటర్వ్యూలో నెగ్గినవారికే రుణం కోసం ఫారాలిస్తారు. అవి నింపి జిల్లా అభివృద్ధి అధికారికి ఇవ్వాలి. జిల్లాస్థాయి సంఘం సిఫార్సుతో ఆ దరఖాస్తు బోర్డుకు వెళ్తుంది. ఫైనాన్స్ స్టాండింగ్ కమిటీ అర్థిక సహాయం మంజూరు చేస్తుంది. ప్రత్యేక సభలో రుణాలకు సంబంధించిన చెక్కులను లబ్ధిదారులకు అందిస్తారు.

షెడ్‌లు, గోడౌన్ నిర్మించేందుకు, పరికరాలు కొనేందుకు, వర్కింగ్ క్యాపిటల్‌కు ఆయా పరిశ్రమలకు నిర్దేశించిన ప్రకారం సహాయం లభిస్తుంది.

నిర్ధారితమైన కొండ ప్రాంతాలవారికి, యస్.సి., యస్.టి.లకు వికలాంగులకు, మహిళా సహకార సంస్థలకు మరింత ఉదారంగా సహాయం లభిస్తుంది. షెడ్ వగైరా నిర్మాణానికి యాభైశాతం గ్రాంట్‌గా, మిగిలిన యాభైశాతం రుణం ఇస్తారు. అలాగే యంత్రపరికరాలకైతే అరవై అయిదుశాతం గ్రాంట్‌గా, ముప్పై అయిదుశాతం రుణంగా ఇస్తారు. మహిళలు సహకారసంఘాలుగా, రిజిస్టర్డ్ అసోసియేషన్‌గా ఏర్పడితే అర్థిక సహాయం గ్రాంటురూపంలో చాలావరకు అందుతుంది. దీనిని తిరిగి చెల్లించనక్కర్లేదు.

ఖాదీ కోసం తీసుకున్న రుణంపై వడ్డీలేదు. గ్రామీణ పరిశ్రమలపై రుణం నాలుగుశాతం వడ్డీ వుంటుంది. రిజిస్టర్డ్ సంస్థలు లేక సంఘాలు చెల్లించే నాలుగుశాతం వడ్డీకాకుండా చెల్లించవలసిన మిగతా వడ్డీని ఖాదీగ్రామీణ పరిశ్రమల బోర్డు సబ్సిడీగా చెల్లిస్తుంది.

వ్యక్తిగతంగా రుణం కావాలంటే స్వంతంగా కొంత భూమివుండాలి. ఆ భూమి, ఉపాధికోసం కోనే పరికరాలు బోర్డు తనఖాలో వుంటాయి.

రుణాలపై హామీలు అవసరం. అయిదువేలలోపు అప్పుకు వ్యక్తిగత హామీ చాలు. ఇరవైవేల వరకు స్టాంప్ కాగితంపై ఇద్దరి హామీ కావాలి. దానికి మించితే మూడో వ్యక్తి, (థర్డ్‌పార్టీ అంటారు) స్థిరాస్థి తనఖా పెట్టాలి. ఈ స్థిరాస్థి విలువ రుణానికన్నా 125 ఎక్కువ శాతం వుండాలి.

రుణం తీర్చేందుకు 10 సంవత్సరాలు వ్యవధి వుంటుంది. కచ్చా నిర్మాణాలకు 5 సంవత్సరాలు, యంత్రాలకు 10 సంవత్సరాలు, పరికరాలకు 5 సంవత్సరాలు గరిష్ట వ్యవధి. ఇందులో మొదటి సంవత్సరం అప్పుతీర్చనక్కర్లేదు. మొదటి వాయిదా రెండో సంవత్సరం చివర కట్టాలి. గ్రామీణ పరిశ్రమల్లో వర్కింగ్ కాపిటల్ రుణం 5 సంవత్సరాలలోగా తీర్చాలి. తొలి వాయిదా మూడో ఏడాది మొదట్లో చెల్లించాలి.

ఉపాధి పథకాల ద్వారా ఉత్పత్తిచేసిన వస్తువుల ఖాదీభాండార్లు, సేల్సు డిపోల ద్వారా అమ్మేందుకు బోర్డు సాయం చేస్తుంది. బోర్డు వారిచ్చే డిస్కౌంట్ (తగ్గింపు)తోపాటు పండగరోజుల్లో ప్రభుత్వం కూడా 5 శాతం అదనంగా డిస్కౌంట్ ఇస్తుంది. 39 రకాల గ్రామీణ పరిశ్రమలకు అమ్మకంపన్ను, కొనుగోలు పన్ను రాయితీ వుంది. ఇందువల్ల అవి మార్కెట్‌లో పోటీని తట్టుకొని నిలబడే అవకాశం ఏర్పడుతుంది.

**5. డి.డబల్‌యూ. సి. ఆర్. ఏ :-** డెవలప్‌మెంట్ ఆఫ్ విమెన్ అండ్ చిల్డ్రన్ ఇన్ రూరల్ ఏరియాస్ అనే పథకం 1982-83 నుండి వుంది. ఇది గ్రామీణ మహిళల కోసం, పిల్లలకోసం ఏర్పడింది. కలసికట్టుగా పని చేస్తే గ్రామీణ మహిళలు ఈ పథకం క్రింద స్వయంఉపాధి అవకాశాలు పెంచుకోవచ్చు. ఈ పథకం దారిద్ర్యరేఖకు దిగువన వున్న గ్రామీణ మహిళలకోసం వుంది. వీరు ఐ.ఆర్.డి.పి (ఇంటిగ్రేటెడ్ రూరల్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం, సమగ్ర గ్రామీణ అభివృద్ధి పథకం) రుణాలు, సబ్సిడీలు కూడా పొందవచ్చు. ఈ పథకంలో పది, పదిహేనుమంది ఒక బృందంగా ఏర్పడవచ్చు. ఈ బృందం రాష్ట్ర సహకారసంఘాల చట్టం పరిధిలో రిజిస్టర్ చేసుకుని బ్యాంకులనుంచి రుణాలు పొందవచ్చు. మనరాష్ట్రంలో ఎంపికైన 16జిల్లాలలో ఈ విధంగా చట్టపరంగా నమోదుకాని వారికి కూడా ఆర్థిక సహాయం అందిస్తున్నారు. ఇటువంటి బృందాలలో కనీసం అయిదుగురు సభ్యులు ఉండాలి. వీరికి పదిహేనువేల వరకు రివాల్వింగ్ ఫండ్ ఇస్తారు. కొన్ని సందర్భాలలో ఐ.ఆర్.డి.పి. వారు యాభైశాతం సబ్సిడీ కూడా ఇచ్చే అవకాశం వుంది. ఈ డి. డబల్‌యూ.సి.ఆర్.ఏ పథకంలో ప్రతిబ్లాక్‌కూ ఓ గ్రామసేవిక వుంటుంది.

ఆమె బృందాల కార్యక్రమాలు పర్యవేక్షిస్తుంది. ముడిపదార్థాలు సక్రమంగా కొనుగోలు చేయడం, ఉత్పత్తులు సరిగా అమ్ముకోవడం, వాటివల్ల లభించే మొత్తాలను పూర్తిగా, లేక పాక్షికంగా బ్యాంకులలో భద్రపరచుకోవడానికి ఆమె సాయపడుతుంది. ఈ విధంగా పశ్చిమ బెంగాల్ లో నాణ్యమైన వస్తువులను తయారుచేస్తున్నారు. పంజాబ్ లో మహిళలకు ప్రభుత్వ కాంట్రాక్టులు అప్పగించే సాయంచేస్తున్నారు. సహకారసంఘంగా రూపొందిన మహిళలుకూడా ఈనాడు ఎన్నో విజయాలు సాధిస్తున్నారు. ఉదాహరణకు కరీంనగర్ జిల్లాలో సంఘంగా ఏర్పడ్డ మహిళలు నెలకింత అని దాచుకుంటున్నారు. అవసరమైనవారికి రుణాలు ఇస్తున్నారు. వీరికి హైదరాబాద్ కు చెందిన సమాఖ్య అనే స్వచ్ఛంద సంస్థ సహకరిస్తోంది. అలాగే గుజరాత్ కు చెందిన సెల్ఫ్ ఎంప్లాయిడ్ విమెన్స్ అసోసియేషన్ (సేవా) అనే స్వయం ఉపాధి మహిళాసంఘం ఎన్నో విజయాలు సాధించింది.

**6. ఐ.ఆర్.డి.పి. :-** దరిద్రంతో బాధపడుతూ ఉన్నా, అవకాశాలున్నట్లు తెలియని గ్రామీణులకోసం సమగ్ర గ్రామీణ అభివృద్ధి పథకం లేక ఇంటగ్రేటెడ్ రూరల్ డెవలప్ మెంట్ ప్రోగ్రామ్ (ఐ.ఆర్.డి.పి.) 1980 అక్టోబర్ 2 (గాంధీ జయంతి)నాడు మొదలైంది. ఏడాదికి ఆరువేల నాలుగువందల రూపాయలకన్న తక్కువ ఆదాయంవున్నవారు దారిద్రరేఖకు దిగువ వున్నట్లు గుర్తించి వారికి ఆదాయం పెంచుకునే మార్గాలను బోధించడం ఈ సంస్థ లక్ష్యం. గ్రామాలో వృత్తులు చేసుకునేవారికి ఈ ఐ.ఆర్.డి.పి. పథకాలు సాయపడుతాయి. లబ్ధిదారులలో కనీసం 40 శాతం మహిళలు ఉండాలని పథకాలు నిర్దేశిస్తున్నాయి. ఈ పథకాలకింద గ్రామీణ యువతకు స్వయం ఉపాధి శిక్షణ (ట్రెయినింగ్ ఆఫ్ రూరల్ యూత్ ఫర్ సెల్ఫ్ ఎంప్లాయ్ మెంట్ లేక ట్రైసెమ్), గ్రామీణ ప్రాంతాలలో మహిళల, పిల్లల అభివృద్ధి (డెవలప్ మెంట్ ఆఫ్ విమెన్ అండ్ చిల్డ్రెన్ ఇన్ రూరల్ ఏరియాస్) అనే రెండు ఉపపథకాలున్నాయి. రెండింటిలోనూ మహిళలకే ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తారు. పశుపోషణ, వ్యవసాయానికి సంబంధించిన కార్యక్రమాలు, చేపలపెంపకం, కుక్కుగొడుగుల ఉత్పత్తి, కోళ్ళ పెంపకం, పందులపెంపకం, అగ్గిపెట్టెల తయారీ, సబ్బుల తయారీ, హాండ్ మేడ్ పేపరు, కూరగాయలు పళ్లు నిల్వచేయడం, హస్తకళలు, ఖాదీ, కాగితాన్ని చేతితో తయారుచేయడం, పట్టుపరిశ్రమ, సర్క్యులేటింగ్ లైబ్రరీ, భీమా ఏజన్సీ మొదలైన పనులకు రుణసహాయం అందిస్తారు.

జిల్లాలోని మహిళా శిశుసంక్షేమ అధికారిణి లేక ఐ.ఆర్.డి.పి. ప్రాజెక్ట్ డైరెక్టర్, లేక మండల అభివృద్ధి అధికారి. వీరిలో ఎవరైనా ప్రాజెక్ట్ నమూనాలను అంగీకరించి రుణసహాయానికి దారి చూపవచ్చు. ఐ.ఆర్.డి.పి వారు లబ్ధిదారులకోసం పల్లెల్లో శిబిరాలు(విలేజి కాంప్) నిర్వహిస్తారు. వీటికి దరఖాస్తుదారులు, మండల అధికారులు, అప్పు ఇచ్చే బ్యాంక్ అధికారులు హాజరౌతారు.

దరఖాస్తు, రుణంతో పొందే వనరులు, ఆస్తి వగైరా తనఖా ఒప్పందం, రుణం తాలూకు రసీదు, ప్రోనోటు వగైరాలు దరఖాస్తుదారులు నింపి ఇవ్వాలి. వీటిని పరిశీలించి మండల అభివృద్ధి అధికారి సంబంధిత బ్యాంక్‌కు పంపుతారు. నాబార్డ్ వారి మార్గదర్శకసూత్రాల ప్రకారం వాటిని పరిశీలించి బ్యాంక్‌వారు రుణాలు మంజూరుచేస్తారు.

బలహీనవర్గాలవారికి 25 నుండి 50 శాతం సబ్సిడీ కుటుంబానికి నాలుగు వేల రూపాయలకు మించకుండా ఇస్తారు. షెడ్యూల్డ్ కులాలు, జాతులవారికి, వికలాంగులకు అయిదువేల దాకా ఇస్తారు. ఇటువంటి సబ్సిడీని దారిద్ర్యరేఖకు దిగువవున్న మహిళలు కూడా పొందే వీలుంది. సబ్సిడీ పోగా మిగిలిందే రుణంగా ఇస్తారు. వడ్డీరేటు అప్పునుబట్టి 10-16 శాతం మధ్య వుంటుంది.

పదివేల రూపాయలకులోపు రుణాలకు చరాస్తులు హామీగా ఇవ్వాలి. అంత కుమించితే స్థిరాస్థి కూడా హామీగా ఇవ్వాలి. ఈ రుణాలు మూడేళ్ల కాలంలోగా తీర్చాలి.

గ్రామీణ యువతకు స్వయం ఉపాధి శిక్షణ అనే లక్ష్యంతో ట్రైసెమ్ పథకం వాడుకలో వుంది. దీనికి 18-35 సంవత్సరాల మధ్య వయస్సు ఉన్న వారు కావాలి. అవసరాన్నిబట్టి శిక్షణ ఇస్తారు. శిక్షణ పొందేవారిలో నలభై శాతం మహిళలే ఉండాలి. ఈ శిక్షణకు కనీస విద్యార్హతలు ఏమీ లేవు. ఐ.టి.ఐ ( పారిశ్రామిక శిక్షణ సంస్థ), కృషి విజ్ఞానకేంద్రాలు(ఉపకారవేతనం) ఇస్తారు. శిక్షణాకాలంలో ఉపాధికి సంబంధించిన అన్ని అంశాలనూ పరిశీలించి శిక్షణ కాగానే ఉపాధి ఏర్పరచుకునే వీలు కల్పిస్తారు. అరునెలల శిక్షణ పూర్తికాగానే ఉపాధి లభించే ఐ.ఆర్.డి.పి. పథకాలు గ్రామీణ ప్రాంతాలవారికి వరాలవంటివి.

**7. "సేవా" :-** మహిళాభ్యుదయంకోసం పనిచేస్తున్న స్వచ్ఛంద సంస్థ ఇది. శ్రీమతి ఇళాభట్ దీని అధ్యక్షురాలు. స్త్రీలలో వున్న చక్కని సృజనాత్మక శక్తి, ఓర్పు మొదలైన మంచి లక్షణాలను వారికి గుర్తుచేస్తూ వారికి స్వయం ఉపాధి పథకాలగురించి చెప్పడం ఈ సంస్థ పని. వీధులలో అమ్ముకునేవారు, ఇంట్లో చీరెలు, అగరొత్తులు తయారుచేసేవారు, లాండ్రీ, రవాణా, వ్యవసాయం తదితర రంగాలలోని వారు మొదలైన రకరకాల పనులు చేసే మహిళలకు సమాజంలో ఒక గుర్తింపు తేవడం ఈ సంస్థ ధ్యేయం. ఈ రంగంలో వీరికృషి అపారం. అపూర్వం. అనితరసాధ్యం. 1974లో మహిళా సహకార బ్యాంకు, 1975లో 'సేవా మహిళాట్రస్ట్' ఏర్పడ్డాయి. ఈ సంస్థల ద్వారా స్వయం ఉపాధి మహిళల కుటుంబ సంక్షేమం గురించి సేవా శ్రద్ధ తీసుకుంటుంది. వారికోసం గుజరాతీ భాషలో "అనసూయ" అనే పత్రికను, 'వియ్ ది సెల్ఫ్ ఎంప్లాయిడ్' అనే ఆంగ్లపత్రికను నిర్వహిస్తూ ఉంది. మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, బీహార్, ఢిల్లీ, గుజరాత్ ప్రాంతాలలో 'సేవా' సంస్థ కార్యకలాపాలు

బహుళ ప్రచారం పొందాయి. ఇటువంటి సంస్థలు మరిన్నివస్తే మహిళలలో స్వయం ఉపాధి మరింతగా అభివృద్ధి చెందుతుంది. ఇల్లాలి కంటివెలుగు ఇంటికే వెలుగవుతుంది. గ్రామీణ కుటుంబాలు బాగుపడితే దేశమంతా బాగుపడినట్లే. దేశసౌభాగ్యం గ్రామాల్లోనే వుందని గాంధీగారుకూడా అన్నారు కదా!

## 18. మహిళల స్వయం ఉపాధికి బ్యాంకుల సహకారం

ఎవరికైనా రుణసహాయం అనగానే గుర్తుకు వచ్చేవి బ్యాంకులే. అవసరానికి ఆదుకొని దేశప్రగతికి తోడ్పడంలో బ్యాంకులు నిర్వహిస్తున్న పాత్ర ప్రశంసనీయం. స్వయం ఉపాధి పథకాలకు ఏయే బ్యాంకులు ఏ విధంగా సహాయపడుతున్నాయో తెలుసుకుందామా?

***1. స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా :*** చిన్న పరిశ్రమలు ఏర్పాటు చేసే వారికి, చిన్న వ్యాపారాలు చేసుకునే వారికి సహాయం చేయడంలో ఎప్పుడూ ముందుగా నిలిచే ఈ బ్యాంక్ మహిళల స్వయం ఉపాధికి కూడా ఎంతో తోడ్పడుతుంది. డిసెంబర్ 87 నాటికి లక్షమందికి పైగా మహిళలకు దాదాపు యాభై అయిదు కోట్ల రూపాయలు ఈ బ్యాంక్ అందించింది. మహిళల కోసం 'స్త్రీశక్తి' అనే పథకాన్ని ప్రవేశపెట్టింది. మహిళలకు మంచి శిక్షణ నిచ్చి వారికి తగిన సలహాయింపులతో ప్రోత్సహించడం దీని ఉద్దేశం. ఈ పథకంలో కొన్ని ప్రత్యేకతలున్నాయి. వడ్డీరేట్లలో 0.5 శాతం తగ్గింపు ఉంటుంది. మార్జిన్‌మనీ (ఔత్సాహికుల పెట్టుబడి) మామూలు బ్యాంక్ పథకాలకన్నా 5 శాతం ఎక్కువ రుణాల దరఖాస్తులు నెలలోగా పరిష్కరిస్తారు. ఇతర ఆర్థిక సంస్థల ప్రమేయం వుంది. రుణం ఎక్కువ వున్నప్పుడు మాత్రం కొంచెం ఆలస్యం కావచ్చు. రాష్ట్రమంతటా మహిళలను ఎన్నుకుని వారికి స్వయం ఉపాధిలో ప్రత్యేక శిక్షణనిస్తారు. ఇందుకయ్యే ఖర్చు మొత్తం బ్యాంక్ భరిస్తుంది. పరిశ్రమలు పెట్టలేకున్నా ఇంటిదగ్గర తమవంతు కృషి చేయదలచుకున్న వారికి కూడా సహాయం లభిస్తుంది.

స్త్రీలు బృందాలుగా ఏర్పడి చిన్న పరిశ్రమలు నెలకొల్పేందుకు 35 లక్షలదాకా సహాయం లభిస్తుంది. ఇంతకుముందే వున్న యూనిట్‌ల నవీకరణ, విస్తరణ, పునరుద్ధరణ మొదలైన వాటికి కూడా సాయం చేస్తారు. ఇరవై అయిదువేల రూపాయల రుణానికి ఔత్సాహికుల పెట్టుబడి ఏమీలేదు. ఆపైన అయిదు లక్షల రూపాయల వరకూ కేవలం అందులో 15శాతం పెట్టుబడి అవసరం. అయిదు లక్షలపైన అప్పుకు 20 శాతం పెట్టుబడి కావాలి. ఇంకో పథకం కింద యంత్రపరికరాల కొనుగోలు, రిపేర్లు, ఫాక్టరీ భవన నిర్మాణం పెట్టుబడి సొమ్ము మొదలైన పనులకు సహాయం చేస్తారు. దీనిలో 2 లక్షల రూపాయలవరకు ఎటువంటి పెట్టుబడి అవసరంలేదు. 2-3 లక్షల వరకు 5శాతం పెట్టుబడి, ఆపైన 10 లక్షల వరకు 7.5 శాతం పెట్టుబడి కావాలి.

ఈక్విటీ ఫండ్ స్కీమ్ పథకం కింద ఏమాత్రం పెట్టుబడి పెట్టలేని వారికి సహాయం ఇస్తారు. యూనిట్‌ను తొలిసారిగా స్థాపించేవారికి, శ్రద్ధగా అంకిత భావంతో పనిచేసేవారికి సహాయం లభిస్తుంది. ఇందులో ప్రాజెక్టు ఖరీదు పాతికవేల రూపాయలకు పైబడి వుండాలి. ఈ పథకంలో కనీస సాయం అయిదువేలు, గరిష్ట సహాయం చిన్న పరిశ్రమలకైతే లక్ష రూపాయలు, స్వయం ఉపాధి, వృత్తి రంగాలవారికి యాభైవేలు ఇస్తారు.

అప్పు తీర్చేందుకు ముందు 5-7 సం.ల మారటోరియం వుంటుంది. ఈ సమయంలో వడ్డీ వగైరా చెల్లించనక్కర్లేదు. తర్వాత 5-7 సం.లలో అప్పును తీర్చవచ్చు.

గ్రామీణ పరిశ్రమలకు (కుమ్మర్లు, సాలెవాళ్ళు, బొమ్మలు తయారుచేసే వారు మొ.) స్థానిక వనరులను వినియోగించుకునే వారికి పాతికవేలు ఇస్తారు. ఇందుకు మార్జిన్‌మనీ అవసరంలేదు. వడ్డీరేటు వెనుకబడ్డ ప్రాంతాలలో 10 శాతం, ఇతర ప్రాంతాలలో 12 శాతం వుంటాయి. 10 సంవత్సరాలలోగా అప్పు తీర్చాలి.

చిన్న వ్యాపారులకు కూడా ఆర్థిక సహాయం లభిస్తుంది. నాలుగు లక్షల రూపాయల టర్నోవర్ మించని వ్యక్తులు ఈ పథకం కింద వస్తారు. ఎరువులు, ఖనిజ తైలాలు మొదలైన వ్యాపారాలలో టర్నోవర్ పది లక్షల వరకూ వుండవచ్చు. బ్యూటీపార్లర్ మొదలైనవి కూడా ఈ పథకంలో సహాయానికి పనికొస్తాయి. ఇటువంటి వాటిలో పరికరాల అసలు ఖరీదు రెండు లక్షల రూపాయలకు మించకూడదు. వీటికి వర్కింగ్ కాపిటల్ లక్షరూపాయలు, టర్మ్‌లోన్స్ ఒకటిన్నర లక్ష రూపాయలు ఇస్తారు.

మెడికల్ ప్రాక్టిషనర్‌లు, దంతవైద్యులు, ఇంజనీర్‌లు, లాయర్‌లు, ఆర్కిటెక్టులు మొదలైనవారికి కూడా రెండు లక్షలరూపాయల దాకా ఆర్థిక సహాయం చేస్తారు. వాహనాలు అద్దెకు నడిపేవారికి తగిన లైసెన్స్, పర్మిట్ వున్న పక్షంలో ఆరు వాహనాలు కొనుక్కునేందుకు సహాయం చేస్తారు. వీటన్నిటికీ వడ్డీరేట్లు 12.5 శాతం నుండి 15 శాతం దాకా వుంటాయి.

ఈ అప్పులకు సెక్యూరిటీగా బ్యాంకు రుణాలతో కొనుక్కున్న ఆస్తులు తనఖా పెట్టాలి. మూడో వ్యక్తి గ్యారంటీ అవసరంలేదు. ఇది పాతికవేల లోపు రుణానికి వర్తిస్తుంది. రుణం అంతకుమించితే అప్పు తీసుకున్న వారితోపాటు మరొకరు పూచీ వుండాలి.

మహిళకు ఐ.ఆర్.డి.పి., ఎస్.ఈ.ఈ.యు.వై, వైస్.ఇ.పి.యు.పి. మొదలైన స్కీములలో కూడా రుణాలు లభిస్తాయి.

**అప్పులు లభించే కొన్ని స్కీములు :**

**పరిశ్రమలు :** అప్పడాలు, ఊరగాయలు, చేనేత, హస్తకళలు, గాజులు, బొమ్మలు, కుండలు, బట్టలు, కంప్యూటర్ శిక్షణ, ఇతర చిన్న పరిశ్రమలు.

**వృత్తి, స్వయం ఉపాధి :** ఛార్టర్డ్ అకౌంటెంట్, లాయర్, డాక్టర్, ఆర్కిటెక్ట్, గృహాలంకరణ (ఇంటీరియర్ డెకొరేషన్, పెయింటర్, ఫొటోగ్రాఫర్, కమర్షియల్ ఆర్టిస్ట్, కోచింగ్, టైప్ ఇన్‌స్టిట్యూట్, విద్యాబోధనా పరికరాలు, సంగీత నృత్య పాఠశాల మొ.

**వ్యాపార సంస్థలు :** బ్యూటీపార్లర్‌లు, లాండ్రీ, టీస్టాల్, టిఫిన్ సెంటర్, డిజైనర్ బోటిక్, సర్క్యులేటింగ్ లైబ్రరీ, టైలరింగ్ షాప్, వెట్ గ్రైండింగ్ (పిండి రుబ్బడం), ఇంటింటి సరుకులు తెచ్చిఇచ్చే హోమ్‌డెలివరీ సర్వీసెస్, శిశుపాలన కేంద్రం, చాపల తయారీ, బేకరీ మొ.

**చిల్లర వ్యాపారం :** కిరాణా, పాత్రలు, పాన్‌షాప్, పాతబట్టలకు పాత్రల వ్యాపారం, **విత్తుత్తి వైనా పంపిణీచేసే డీలర్,,** కూరగాయలు పండ్లు, పూలు అమ్మడం, చేపలు అమ్మడం, గాజుల అంగడి, మెడికల్ షాప్ మొ.

**వ్యవసాయ సంబంధం :** తేనెటీగల పెంపకం, పూలతోట, కోళ్ళ పరిశ్రమ, పాడి పరిశ్రమ మొ.

అన్ని వివరాలకు సమీపంలోని బ్రాంచి మేనేజర్‌ను కలిస్తే మంచిది.

*2. ఆంధ్రాబ్యాంక్ :* సమగ్ర (సమీకృత) గ్రామీణాభివృద్ధి పథకం (ఐ.ఆర్.డి.పి) వారు ఆర్థికసాయం అందించే పథకాలకు ఆంధ్రాబ్యాంక్ కూడా సహాయం చేస్తుంది. అభ్యర్థుల ఎంపిక కోసం క్రెడిట్ క్యాంపులు నిర్వహిస్తుంది. స్థానిక మండలాధికారి పర్యవేక్షిస్తారు. శిక్షణలో పాల్గొనదలచినవారు స్థానిక ఎమ్.ఆర్.వోను కానీ, స్త్రీ సంక్షేమశాఖకు చెందిన మహిళా విస్తరణాధికారిని కానీ కలుసుకోవాలి. శిక్షణకు ఎంపికైనవారు - పాడిపశువులు, కోళ్ళ పెంపకం, చేపల పెంపకం, కుటీర పరిశ్రమలు, గ్రామీణ వృత్తులు మొదలైనవాటిలో ఏదో ఒకటి ఎంచుకోవచ్చు. స్త్రీ సంక్షేమశాఖ లేక రాష్ట్ర మహిళల ఆర్థిక సహాయసంస్థ రెండువేల రూపాయలకు మించకుండా $6\frac{1}{2}$ శాతం వార్షికవడ్డీపై మార్జిన్‌మనీ ఇస్తుంది (మార్జిన్‌మనీ అనేది స్వయం ఉపాధి కోరే మహిళ చెల్లించవలసిన పెట్టుబడి) ఇందువల్ల సొంతపెట్టుబడి అవసరంలేదు. స్వయం ఉపాధికి ఈ మొత్తం సరిపోదు కాబట్టి మిగిలిన సొమ్ము బ్యాంకు రుణంగా ఇస్తుంది. ఇందుకోసంపై సంస్థల సిఫార్సుతో వచ్చిన దరఖాస్తులను బ్యాంకు పరిశీలించి రుణాలు ఇస్తుంది. వర్కింగ్ క్యాపిటల్‌గా లభించే రుణంపై 4.25 శాతం వార్షికవడ్డీ వుంటుంది. ఇదేవిధంగా ఇరవైసూత్రాల పథకం కింద కూడా మహిళాపారిశ్రామికులకు ఆంధ్రాబ్యాంక్ చేయూతనిస్తోంది.

వడ్డీరాయితీ పథకం (డిఫరెన్షియల్ రేట్ ఆఫ్ ఇంటరెస్ట్, డి.ఐ.ఆర్) కింద లబ్ధిదార్లకు కేవలం 4 శాతం సంవత్సర వడ్డీ మాత్రమే వుంటుంది.

అయితే ఇందుకు కుటుంబ వార్షికాదాయం ఆరువేల అయిదువందలకు మించ రాదు. వ్యవసాయ బావుల త్రవ్వకం, పాడిపరిశ్రమ, కోళ్ళ పరిశ్రమ, పట్టుపరిశ్రమ మొదలైన వాటికి అర్హులైన వారిని స్థానిక మండల రెవిన్యూ అధికారి (ఎమ్.ఆర్. వో) ఎంపిక చేస్తారు.

తెలుగుదేశం ప్రభుత్వం కాలంలో వుండిన గ్రామోదయ పథకం ఈనాడు ఎస్.ఈ.ఈ.యూ.పై అయింది. లబ్ధిదార్లు మార్జిన్ మనీ పెట్టవలసిన అవసరం లేకపోవడం ఇందులో ప్రత్యేకత. దీనికింద విద్యావంతులు, నిరుద్యోగులు అయిన మహిళలు రుణం పొందవచ్చు. కుటీర పరిశ్రమలు, కిరాణా, ఇతర వ్యాపారం, మరమ్మత్తులు, నిర్వహణ మొదలైన వాటికి రుణాలు ఇస్తారు. సర్వీస్ (సేవా) కార్యక్రమాలకు పాతికవేల వరకు, చిన్న వ్యాపారాలకు పదిహేనువేల వరకు, పిండిమర వంటి లఘు పరిశ్రమలకు ముప్పై అయిదువేలు బ్యాంక్ ఇస్తుంది. ఇందులో 25 శాతం మొత్తం ప్రభుత్వం సబ్సిడీగా ఇస్తుంది. జిల్లా పరిశ్రమ కేంద్రానికి దరఖాస్తు చేసుకున్న మహిళలలో కొందరిని ఎంపికచేసి సహాయం అందిస్తారు. ఇందులో యస్.సి, యస్.టి, మైనారిటీ మహిళలకు ప్రాముఖ్యం వుంటుంది.

***3. సిండికేట్ బ్యాంక్ :*** స్త్రీల ఆర్థిక పురోభివృద్ధికి తోడ్పడుతున్న అనేక బ్యాంకులలో ఇది అగ్రగామిగా గుర్తింపు పొందింది. 1942లోనే బెంగుళూరులోని శేషాద్రిపురంలో అంతా మహిళలే నిర్వహించే బ్యాంక్ శాఖను 30 మంది మహిళలతో వీరు ప్రారంభించారు. 1988లో ఔత్సాహిక పారిశ్రామిక వేత్తల కోసం సిండికేట్ సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంట్ ప్రోగ్రాం అనే కార్యక్రమాన్ని ఈ బ్యాంక్ ప్రారంభించింది.

ఈ కార్యక్రమం కింద వివిధ సహాయపథకాలకు లబ్ధిదారులను ఎన్నుకోవడం, ప్రోత్సహించడం, సాంకేతిక సలహాలు సూచనలు ఇవ్వడం, ఆర్థిక సాయం చేయడం, రుణాలను పర్యవేక్షించడం మొదలైన పనులు జరుగుతాయి. దేశం మొత్తం మీద హర్యానా, కర్నాటక, ఆంధ్ర, ఉత్తరప్రదేశ్, కేరళ రాష్ట్రాలలోని 19 జిల్లాలలో ఈ కార్యక్రమం అమలులో వుంది. నిపుణులు ప్రాథమిక శిక్షణ ఇచ్చిన తర్వాత అందులో ఎన్నికైన వారికి పాతికవేల రూపాయలు రుణం ఇస్తారు. తర్వాత కూడా నిత్యం సంప్రదింపులు, సలహా సూచనలు ఇస్తారు.

గ్రామీణాభివృద్ధి & స్వయం ఉపాధి శిక్షణ సంస్థ (రూరల్ డెవలప్‌మెంట్ & సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంట్ ట్రెయినింగ్, RUDSET) స్త్రీలకు ప్రత్యేకంగా శిక్షణ ఇస్తుంది. ఇటువంటి శిక్షణ సంస్థలను ఎనిమిది బ్యాంకులవారు నిర్వహిస్తున్నారు. వీటిలో ఒకటి ప్రకాశం జిల్లాలోని వేటపాలెంలో వుంది. అభిరుచి, ప్రాంతీయ అవసరాలు దృష్టిలో వుంచుకుని శిక్షణ ఇస్తారు.

సాధారణంగా వ్యవసాయం, డైరీ, పౌల్ట్రీ, పందుల పెంపకం, చిన్న

వ్యాపారం, కుటీర పరిశ్రమలు దాని సంబంధించిన అంశాలు, పట్టుపరిశ్రమ, తోటల పెంపకం, పంపుసెట్లు, డస్టర్లు, స్ప్రేయర్లు మొదలైన పరికరాల రిపేర్లు, బుక్ బైండింగ్, ఫొటోగ్రఫీ, కుట్టు యంత్రాల రిపేర్లు, నిర్వహణ మొదలైనవన్నీ మహిళలకు అనుగుణంగా వుండేవే. అందుబాటులో వున్నవే.

వీటికి స్వయం ఉపాధిపై ఆసక్తి, 18-35 సం. వయస్సు, అక్షరాస్యత, వీలైతే 7వ తరగతి వరకు చదువు వుండాలి. ఉచిత భోజన వసతి, అవసరం వున్నవారికి రవాణాఖర్చులు కూడా ఇస్తారు. శిక్షణ పూర్తికాగానే స్వయంగా ఉపాధి చేపట్టవచ్చు. బ్యాంకులనుండి రుణాలను కూడా రడ్ సెట్ ఇప్పిస్తుంది.

స్మాల్ ఇండస్ట్రీస్ డెవలప్‌మెంట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా వారు రూపొందించిన మహిళా పథకాలకు కూడా సిండికేట్ బ్యాంక్ ఆర్థిక సహాయం అందిస్తుంది. ఈ పథకం కింద ఎంపికైన మహిళలు ప్రాజెక్టు ఖర్చులో 51% పెట్టుబడి పెట్టవలసి వుంటుంది. ఈ సహాయ కార్యక్రమాల కోసం సిండికేట్ బ్యాంక్ కార్పొరేట్ ఆఫీసులో ప్రత్యేక విభాగం వుంది.

**4. యూనియన్ బ్యాంక్ :** స్వయం ఉపాధి రుణాలు ఇవ్వడంలో ఈ బ్యాంక్‌కు ఒక ప్రత్యేకత వుంది. అదే వికలాంగులైన మహిళలకోసం ప్రత్యేక పథకాలు ఏర్పాటుచేయడం.

ఎంబ్రాయిడరీ, మసాలా పొడులు, వత్తురసాలు, డబ్బాలు సీలువేయడం వంటి పనులు, నేతపని, కొయ్యచెక్కడం, బుట్టల అల్లిక, సంచుల తయారీ, బొమ్మలు రూపొందించడం, చాపలు అల్లడం, జరీపనులు, బీడీలు చుట్టడం మొదలైన పనులకు ఈ బ్యాంకు అప్పులు ఇస్తుంది.

వీటికి మహిళల సొంత పెట్టుబడి (మార్జిన్ మనీ) అనవసరం. టర్మ్‌లోన్ పాతికవేలు ఇస్తారు. బ్యాంక్ అప్పులు ఇస్తుంది.

**బ్యాంకు రుణంతో కొన్ని ఆస్తులు తనఖా పెట్టాలి. 13½ శాతం వడ్డీ రేటుతో అప్పు తీర్చాలి. ఆదాయం, ఇంటిఖర్చును బట్టి నెలకు ఇంతనికాసి, మూణ్ణెల్లకోసారి 3 నుండి 5 సంవత్సరాలలోగా తీర్చాలి.**

గ్రామీణ ప్రాంతాలవారికి పనినేర్చుకుంటూ డబ్బు సంపాదించే పథకం (లర్న్&ఎర్న్) వుంది. దీనికింద రేడియో, టి.వి, వి.సి.ఆర్, ఎయిర్ కండిషనర్ల రిపేరు, వైరింగ్, టైలరింగ్ మొదలైన విషయాలలో శిక్షణ పొందుతూ సంపాదించవచ్చు. ఇందుకు 18-35 సంవత్సరాల వయస్సు, పద వతరగతి చదువు, 7000/- లోపు కుటుంబ ఆదాయం అర్హతలు. అభ్యర్థులు గ్రామోదయ కింద ఎంపికైవుండాలి. మూడునుండి ఆరునెలల శిక్షణ కాలంలో అయిదువేలు, తర్వాత వ్యాపారానికి పదివేలు ఇస్తారు. గరిష్టరుణం పది

వేను వేలు మాత్రం. అభ్యర్థులు స్వంతంగా పెట్టుబడి పెట్టనక్కర్లేదు. తనఖా పెడితే చాలు. రిజర్వుబ్యాంక్ ప్రకారం 12-5-14 శాతం వడ్డీ వుంటుంది. శిక్షణపూర్తి అయిన 6వ నెల తర్వాతనుంచి, లేక వ్యాపారం మొదలుపెట్టిన 3 నెలల తర్వాత నుంచి (ఏదిముందు అయితే అది) నెలవారీ వాయిదాల రూపంలో అప్పుతీర్చవచ్చు. ఇందుకు అయిదేళ్ళ వ్యవధి వుంటుంది.

5. ***సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా :*** 1990 నుంచి ఆంధ్రప్రదేశ్‌లో 93 బ్రాంచీల ద్వారా ఈ బ్యాంక్ మహిళలకు తన సేవలు అందిస్తోంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, ఆంధ్రప్రదేశ్ మహిళా సహకార ఆర్థికసంస్థ, DRDA సిఫార్సు చేసే పథకాలకు వీరు ప్రాముఖ్యం ఇస్తారు. యస్.సి., యస్.టి రాయితీలు మొదలైనవి మామూలే. పథకాల అమలు తీరును పర్యవేక్షించేందుకు రీజినల్ ఆఫీస్ (ప్రాంతీయ కార్యాలయం)లో తగిన ఏర్పాట్లున్నాయి.

బ్రాంచిమేనేజర్‌కు రుణాలకోసం దరఖాస్తు ఇవ్వాలి. పాతికవేల రుణానికి మార్జిన్‌మనీ అక్కర్లేదు. అంతకు పైబడిన రుణాలకు 15 నుండి 25 శాతం దాకా మార్జిన్‌మనీ అవసరం. సబ్సిడీ 15 శాతం కన్నా తక్కువ కానప్పుడు కూడా మార్జిన్‌మనీ అవసరంలేదు. టెక్నోక్రాట్ స్కీమ్ సబ్సిడీ 15 శాతం కన్నా తక్కువ కాబట్టి మార్జిన్‌మనీ తప్పనిసరి.

వృత్తికార్మికులు, గ్రామీణ పరిశ్రమలు వగైరాలకు ఇరవై అయిదువేలదాకా అప్పు కావాలనుకునేవారు ఆస్తులు తనఖా పెట్టాలి. అంతకుమించిన రుణాలకు బ్యాంకువారు నిర్ణయించిన మేరకు హామీలు నిర్ణయిస్తారు. అర్హతకల పథకాలకు హామీ దొరకకున్నా సహాయం ఆపరు. చిల్లరవ్యాపారం, స్వయం ఉపాధి పథకాలకు పాతికవేల లోపు రుణానికి హామీ, మార్జిన్‌మనీ అవసరంలేదు.

ఈ రుణాల అనుమతికి పాతికవేల లోపు రుణానికి హామీ, మార్జిన్‌మనీ అవసరంలేదు.

ఈ రుణాల అనుమతికి పాతికవేల లోపు అయితే 15 రోజులు, అంతకుమించిన వాటికి రెండునెలలు లేక 9 వారాలు గరిష్ట పరిమితి. వడ్డీరేట్లు 11.5 నుండి 3000 రూపాయల సంవత్సర ఆదాయం ఉన్నవారు, గ్రామీణ ప్రాంతాలలో 2000 రూపాయల సంవత్సర ఆదాయం వున్నవారు కేవలం నాలుగుశాతం వడ్డీ చెల్లిస్తేచాలు. ఈవిధంగా లబ్ధిపొందేవారికి నీటి సదుపాయం వున్న భూమి ఒక ఎకరం మించి ఉండకూడదు. నీరులేని భూమి రెండెకరాలకు మించకూడదు. యస్.సి., యస్.టి వారికి ఈ షరతులేదు. మహిళలకు విద్యార్జన కోసం కూడా రుణాలు ఇవ్వడం ఈ బ్యాంక్ ప్రత్యేక.

ఇదేవిధంగా ఎన్నో బ్యాంకులు రుణాలిచ్చి ఆదుకుంటున్నాయి. సంబంధిత అధికార్లను సంప్రదిస్తే పూర్తి సమాచారం తెలుస్తుంది.

రెండవభాగం

# స్వయం ఉపాధి పథకాలు : స్కీముల వివరాలు

## పరిచయం

స్వయంఉపాధి పథకాల కింద ఏం చేయాలి? ఎలా చేయాలి? ఆర్థిక సహాయం ఎలా వుంటుంది మొదలైన అంశాలు మొదటి భాగంలో చదివారు. రెండవ భాగంలో ఈ పథకాల వివరాలు తెలుసుకుంటారు. చదువరుల సౌకర్యం కోసం ఈ పథకాలను వ్యవసాయ సంబంధమైన పరిశ్రమలు, ఆహార పదార్థాలు, ఆటోమొబైల్, ఇంజనీరింగ్, అన్ని అవసరాలకూ పనికొచ్చే ఇనుము, అల్యూమినియం వగైరా వస్తువులు, రసాయనాలు సంబంధిత పరిశ్రమలు, విద్యుత్ పరికరాలు, కొన్ని దుకాణాలు, ఆఫీసు-ఫాన్సీ వస్తువులు, కొన్ని ఇతర వృత్తులు అనే అంశాలుగా వర్గీకరించడం జరిగింది.

ఒక పథకం గురించి ఆలోచించేటప్పుడు దానికి సంబంధించిన వనరులు, లాభనష్టాలు మొదలైన విషయాలు గుర్తుంచుకోవాలి. అలాగే, ముడిసరుకులు ఇబ్బందిలేకుండా దొరుకుతాయా లేదా, తయారైన వస్తువులకు మార్కెట్‌లో గిరాకీ వుంటుందా లేదా అనే విషయాలు కూడా గమనించాలి. ఇందులో ఇచ్చిన లెక్కలు ఉజ్జాయింపుగా వేసినవి. మార్కెట్ ధరలలోని మార్పులకు అనుగుణంగా లెక్కలు కూడా మారుతాయి. అందువల్ల ఈ వివరాలు కేవలం మార్గదర్శకాలే (గైడ్‌లైన్స్) కానీ ఖచ్చితమైన లెక్కలు కావనే విషయం గుర్తుంచుకోవాలి. ఈ వివరాలు ఆధారంగా పాఠకులు మరికొన్ని స్కీమ్‌లు రూపొందించుకునేందుకు ప్రయత్నించవచ్చు. అదే జరిగినప్పుడు ఈ పుస్తకానికి సార్థకత లభిస్తుంది. ఇందులో మొత్తం 101 పథకాలున్నాయి. ఇక పదండి ముందుకు!

# 1. వ్యవసాయ సంబంధమైన పరిశ్రమలు

మనదేశ ఆర్థిక వ్యవస్థ ఇప్పటికీ వ్యవసాయం పైనే ఆధారపడి వుంది. ఈనాడు వ్యవసాయంలో ఎన్నోమార్పులు వచ్చాయి. మామూలు నాగలి స్థానంలో మరనాగళ్ళు వంటి పరికరాలు లేక ఉపకరణాలు వచ్చాయి. వ్యవసాయ ఉపకరణాలు తయారుచేయడం కూడా స్వయంఉపాధి పథకాలలో ప్రాముఖ్యతను సంపాదించుకొంది. వ్యవసాయానికి అనుబంధంగా కోళ్ళపరిశ్రమ, నర్సరీమొక్కలు, పట్టు పరిశ్రమ, నూనెమిల్లు మొదలైనవి కూడా స్వయం ఉపాధికి అనుగుణమైనవే. వీటి వివరాలు తెలుసుకుందాం.

## 1. వ్యవసాయ పరికరాలు

కొడవలి, గొడ్డలి, పార, నాగలి, పన్ను మొదలైన వ్యవసాయ పరికరాలను స్వయం ఉపాధి పథకాల కింద తయారుచేయవచ్చు. దీనికయ్యే కనీసఖర్చులు ఇలా వుంటాయి.

| | రూ.లు |
|---|---|
| స్థలం, భవనాలు - నెల అద్దె | 250 |
| యంత్రపరికరాలు : | |
| 1. కమ్మరి కొలిమి, 1 హార్స్‌పవర్ మోటార్ కంసాలి అటైడ్, సమ్మెట్లు | 3000 |
| 2. ఫిల్లర్ టైప్ మిల్లింగ్‌యంత్రం 0.5 హెచ్.పి. మోటార్‌తో | 3000 |
| 3. డి.ఇ. బెంచ్ గ్రెండర్, 150మి.మీ చక్రం(1/2వ్యాసం), 1 హెచ్.పి.మోటార్ | 1800 |
| 4. చేతిపనిముట్లు | 600 |
| 5. యంత్రాల అమరికలు ఎలక్ట్రికల్ ఫిటింగ్ ఖర్చు | 1800 |
| 6. ఆఫీస్ ఫర్నిచర్ | 600 |
| మొత్తం | 11050 |
| వర్కింగ్ కాపిటల్ (నెలకు) | |
| 1. ముడిసరుకులు | 12000 |
| 2. జీతాలు, వేతనాలు | 1200 |
| 3. ఇతరఖర్చులు నిమిత్తం | 1100 |
| మొత్తం పెట్టుబడి | 14300 |
| 1. యంత్ర పరికరాలు | 11000 |
| 2. నిర్వహణ పెట్టుబడి (నెలకు) | 15000 |
| మొత్తం | 26000 |
| ఆదాయం | |
| తయారుచేసిన ఉపకరణాల అమ్మకం | 18000 |
| తయారైన వస్తువుల వివరాలు | |
| 250 కొడవళ్ళు(ఒకటి18రూ.) | 4500 |
| 250 గొడ్డళ్ళు(ఒకటి12రూ.) | 3000 |

| | రూ.లు |
|---|---|
| 250 పారలు (ఒకటి 12రూ.) | 3000 |
| 250 నాగలివన్ను (ఒకటి 30) | 7500 |
| మొత్తం | 18000 |
| ఇతర ఖర్చులు(నెలకు) | |
| 1. పోస్టేజీ, స్టేషనరీ | 30 |
| 2. కరెంటు, ఇంధనం (బొగ్గు) | 420 |
| 3. ప్రయాణపు ఖర్చులు | 30 |
| 4. ఇంటిఅద్దె | 250 |
| 5. స్టోర్స్ నిర్వహణ (బ్లాక్ పెయింట్, రెడ్‌ఆక్సైడ్ మొ.) | 350 |
| మొత్తం | 1100 |
| ఉత్పత్తి వ్యయం | |
| 1. నిర్వహణ పెట్టుబడి (నెలకు) | 15000 |
| 2. యంత్రాల విలువ తరుగుదల (10%) | 110 |
| 3. వడ్డీ (10%) | 220 |
| మొత్తం | 15330 |
| లాభనష్టాలు | |
| 1. ఆదాయం | 18000 |
| 2. ఖర్చు (ఉత్పత్తిఖర్చు) | 15330 |
| 3. నికరలాభం | 2670 |

## 2. మరికొన్ని వ్యవసాయ పనిముట్లు

తక్కువ ఖర్చుతో వ్యవసాయ పనిముట్లు, పరికరాలు తయారుచేసుకునే మరో పథకం ఇది. వ్యవసాయ రంగంలోనూ సాంకేతిక ప్రమాణాలు సాధించగలమనే నమ్మకాన్నిచ్చే ఈ పథకం నిర్వహణకు ఖర్చు ఎక్కువ కూడా కాదు. వ్యవసాయంతో సంబంధం వున్నవారైనా, లేనివారైనా ఈ పథకం చేపట్టవచ్చు. ఈ పథకం ఆర్థిక వివరాలు ఇలా వున్నాయి.

| | రూ.లు |
|---|---|
| 1. స్థలం, భవనాలు (నెలకు) | 300 |
| 2. యంత్ర పరికరాలు | |
| 1. 4X4 బొగ్గు కొలిమి(ఇటుకలు) | 4200 |
| 2. పోతఇనుము దాగలి, దిమ్మెలు | 600 |
| 3. కొలిమి పరికరాలు | 3000 |
| 4. పెద్దసమ్మెట, పటకారు మొ. | 600 |
| 5. రెండుగదుల పెడెస్టల్ గ్రైండర్ | 3000 |
| 6. డ్రిల్లింగ్ యంత్రం 1/2కాష్ (మోటార్) | 2400 |
| 7. ఇతర పరికరాలు | 1800 |
| మొత్తం | 15900 |
| 3. మళ్ళీమళ్ళీ అయ్యేఖర్చు (రికరింగ్) ముడిసరుకులు(నెలకు) పనికిరాని పాత ఇనుప సామాన్లు టన్ను రూ.5400 చొప్పున 2 టన్నులు | 10800 |
| 4. జీతాలు ఖర్చులు | |
| 1. సూపర్‌వైజర్ (1) | 600 |
| 2. నిపుణులైన పనివారు (2) | 1200 |
| 3. సెమిస్కిల్డ్ వర్కర్ (1) | 420 |
| 4. హెల్పర్ (1) | 300 |
| మొత్తం | 2520 |
| 5. ఇతర ఖర్చులు (నెలకు) | |
| 1. పోస్టేజి, స్టేషనరీ | 60 |
| 2. కరెంట్ | 360 |
| 3. రవాణా | 60 |
| 4. ఇతరఖర్చు | 300 |
| 5. స్టోర్ | 60 |
| మొత్తం | 840 |

| | రూ.లు |
|---|---|
| 6. వర్కింగ్ కాపిటల్ (నెలకు) | |
| 1. ముడిసరుకులు | 10800 |
| 2. జీతాలు | 2520 |
| ఇతర ఖర్చు | 840 |
| మొత్తం | 14160 |
| 7. మొత్తం పెట్టుబడి | |
| 1. యంత్రపరికరాలు | 15600 |
| 2. వర్కింగ్ కాపిటల్ (నెం) | 14160 |
| మొత్తం | 29760 |
| తయారీ ఖర్చు (నెలకు) | |
| 1. వర్కింగ్ కాపిటల్ | 14160 |
| 2. యంత్రాల విలువ | 132 |
| 3. వడ్డీ (10%) | 252 |
| మొత్తం | 14544 |
| 9. ఆదాయం (నెలకు) | |
| 1. వ్యవసాయ పనిముట్లు అమ్మకంపై ఆదాయం | 16800 |
| తయారీ వ్యయం | 14544 |
| నికరలాభం | 2256 |

# 3. పారల తయారీ

పొలాలు, తోటలు, ఇంటినిర్మాణం మొదలైనపనులలో పార తప్పనిసరి అవసరం. పారతో నేలను చదును చేయవచ్చు. ఆటస్థలం చదును చేయవచ్చు. కూలీలు పారను ఎక్కువగా ఉపయోగిస్తారు. అంచేత పారల తయారీ డిమాండు వున్న ఉపాధి.

గ్రామాలలోనూ, రైల్వే వంటి ప్రభుత్వ శాఖలలోనూ దీని వాడకం ఎక్కువ. అంచేత నాణ్యతలో కాస్త జాగ్రత్త వహిస్తే పారల అమ్మకం సమస్యకాదు. పార తయారీకి మధ్యరకం కార్బన్ స్టీల్ ప్లేట్‌లు, తేలికరకం స్టీలు గొట్టాలు అవసరం. వెల్డింగ్ సాయంతో ప్లేటును గొట్టానికి అతికించి, ఆ తర్వాత కావలసిన సైజుకు ప్లేట్‌లను కత్తిరించి, కొలిమిలో వేడిచేస్తారు. చివరగా దాన్ని యంత్ర సహాయంతో అణగగొట్టి పారను తయారుచేస్తారు. పారల తయారీ లాభనష్టాలు, ఖర్చులు ఇలా వుంటాయి.

| | రూ.లు | | రూ.లు |
|---|---|---|---|
| స్థలం, భవనాలు(అద్దెకు) నెలకు | 300 | ముడి సరుకు (నెలకు) | |
| 1.0.5 సామర్థ్యం వున్న డ్రిల్లింగ్ | | 1. 10గేజ్,11గేజ్ వున్న | |
| మిషన్ (తెంచేది) | | మధ్యతరహా కార్బన్‌స్టీల్ | |
| 2. గ్రైండర్ హ్యాండ్ ప్రెస్ | | (1.25 మెట్రిక్ టన్నులు) | 9600 |
| నం. (12)(డబుల్ ఎండెండ్) | | 2. 50మి.మీవెడల్పు6మి.మీ | |
| 3. కమ్మరికొలిమి | 1200 | ముందున్న తేలికరకంస్టీలు | |
| 4. కంసాలి కొలిమి | 6000 | గొట్టాలు (250కి. బరువు) | 2400 |
| 5. 300 ఎమ్.ఎస్. వెల్డింగ్ | 1200 | మొత్తం | 12000 |
| ట్రాన్స్‌ఫార్మర్ | | జీతాలు వగైరా (నెలకు) | |
| 6. చేతిపనిముట్లు | 1200 | 1. సూపర్‌వైజర్ | 600 |
| 7. యంత్రాల అమరిక, | 600 | 2. టెక్నీషియన్ | 540 |
| ఎలెక్ట్రికల్ ఆఫీస్ ఫర్నిచర్ | 600 | 3. ఇద్దరు పనివాళ్ళు | 600 |
| | | (ఒక్కొక్కరికి | |
| ఇతరఖర్చులు (నెలకు) | | రూ.250చొప్పున) | |
| 1. పోస్టేజి, స్టేషనరీ | 180 | వర్కింగ్ కాపిటల్ (నెలకు) | |
| 2. విద్యుత్తు, ఇంధనం | 60 | 1. ముడిసరుకులు | 12000 |
| 3. ప్రయాణఖర్చు | 60 | 2. జీతాలు వగైరా | 1740 |
| 4. స్టోర్స్ | 120 | ఇతరఖర్చులు | 720 |
| 5. అద్దె | 300 | మొత్తం | 14460 |
| మొత్తం | 720 | మొత్తం పెట్టుబడి | |
| | | యంత్రపరికరాలు | 16800 |
| ఉత్పత్తిఖర్చు | | 1. 1000 పారల అమ్మకం | |
| | | ద్వారా (ఒక్కొక్కటి 17) | 17000 |

| | | | |
|---|---|---|---|
| వర్కింగ్ కాపిటల్ (నెలకు) | 14460 | 2. ఉత్పత్తి ఖర్చు | 15000 |
| తరుగుదల (డిప్రియేషన్ 10%) | 210 | 3. లాభం | 1800 |
| వడ్డీ (10%) | 330 | 4. తుక్కు అమ్మగా | 360 |
| మొత్తం | 15000 | 5. నికరలాభం | 2160 |

## 4. వ్యవసాయం సులభతరం చేసే పవర్‌టిల్లర్

ఎద్దులతో పొలం దున్నటం వల్ల సమయం చాలా వృథా అవుతుంది. శ్రమ కూడా అధికం. మనుషులు ఎక్కువ కావడంతో సహజంగా ఖర్చు కూడా ఎక్కువే అవుతుంది. పవర్‌టిల్లర్‌తో దున్నడం వల్ల ఈ సమస్యలు ఉండవు. సమయం ఆదా కావడంతోపాటు కూలీల కొరత కూడా వుండదు. దీనిని వాడేందుకు పెద్ద శిక్షణ కూడా అవసరంలేదు. చిన్నకారు రైతులు కలసికట్టుగా పవర్‌టిల్లర్‌ను కొని వాడుకోవచ్చు. ధర కూడా తక్కువే. ఈ పవర్‌టిల్లర్‌ను స్వయం ఉపాధి పథకం కింద తయారుచేయవచ్చు. దీని వివరాలు ఇలా వున్నాయి.

| | రూపాయలలో | | రూపాయలలో |
|---|---|---|---|
| 1. గది అద్దె (నెలకు) | 120 | 6. మొత్తం ఖర్చు | |
| 2. టిల్లర్ ధర (మారవచ్చు) | 2500 | టిల్లర్‌కు | 30000 |
| 3. మూలధనం | | మూలధనం (నెలకు) | 3600 |
| ముడిసరుకు | ఏమీలేదు | మొత్తం | 33600 |
| యజమానే డ్రైవర్ అయితే జీతం | 480 | 7. నెలకు ఖర్చు | |
| హెల్పర్ (సహాయకుడు) | 240 | మూలధనం | 3600 |
| మొత్తం | 720 | తరుగుదల 10% | 3600 |
| | | వడ్డీ 10% | 276 |
| 4. ఖర్చులు | | మొత్తం | 4128 |
| పోస్టేజీ | 60 | 8. ఆదాయం నెలకు | 5040 |
| రవాణా | 60 | 9. లాభం | 912 |
| కిరాయి (బాడుగ) | 120 | | |
| డీజిల్, ఇతర ఆయిల్ | 2400 | | |
| ఇతర ఖర్చులు | 240 | | |
| మొత్తం | 2880 | | |
| 5. మొత్తంమూలధనం | | | |
| ముడిసరుకు | ఏమీలేదు | | |
| జీతాలు | 720 | | |
| ఖర్చులు | 2880 | | |
| మొత్తం | 3600 | | |

## 5. పనికిరాని భూములలో చేయదగ్గ పథకం నర్సరీ మొక్కలు

పనికిరాని భూములు గ్రామాలలో అక్కడక్కడ కనిపిస్తాయి. వీటిలోనూ, చిన్న చిన్న కమతాలలోనూ నర్సరీ మొక్కలు పెంచవచ్చు. ఈ విధంగా గ్రామస్థులు కొంత ఆదాయం సంపాదించుకోవచ్చు. ఇందుకు బ్యాంకులు కూడా అప్పు ఇస్తాయి. పరిస్థితులను బట్టి సబ్సిడీ ఇస్తారు. ఈ స్కీము వివరాలు మండల కార్యాలయంలోని వ్యవసాయ అధికారి దగ్గర లభిస్తాయి. ఒక ఎకరం నేలలో నర్సరీ మొక్కలు పెంచేందుకు అయ్యే ఖర్చులు, వచ్చే ఆదాయం వివరాలు ఈ విధంగా వుంటాయి.

| | (రూ.) | | (రూ.) |
|---|---|---|---|
| కావలసిన యంత్రాలు, పరికరాలు | | ముడిసరుకు | |
| 1. బోర్ వెల్, పైపు, నీటి మోటారు, చిన్న షెడ్ | 15600 | 1. విత్తనాలు ఎరువులు పురుగుమందులు | 9600 |
| 2. వ్యవసాయ పరికరాలు, | 2400 | | |
| స్ప్రెయరు మొ., జీతాలు, వగైరాలు | | ఇతర ఖర్చులు | |
| 1. మేనేజర్(నర్సరీనిర్వహించేమనిషే మేనేజర్ గా వుంటేమేలు) నెలకు | 480 | 1. తపాలా ఖర్చులు | 60 |
| | | 2. రవాణా | 300 |
| 2. కూలీలు ఇద్దరికీ కలిసి నెలకు | 720 | 3. చిల్లర ఖర్చులు | 240 |
| 3. హెల్పర్స్ ఇద్దరికీ కలిసి నెలకు | 480 | 4. ఇతర ఖర్చులు | 120 |
| మొత్తం | 1680 | మొత్తం | 720 |
| మూలధనం | | మొత్తం ఖర్చు | |
| 1. ముడిసరుకు (నెలకు) | 9600 | 1. మూలధనం | 12000 |
| 2. జీతభత్యాలు | 1680 | 2. యంత్రాలు-పరికరాలు | 18000 |
| 3. ఇతరఖర్చులు | 720 | | |
| మొత్తం | 12000 | మొత్తం | 30000 |
| మొత్తం ఖర్చు (నెలకు) | | అమ్మకాలు | 13200 |
| 1. మూలధనం | 12000 | ఖర్చు | 12396 |
| 2. తరుగుదల 10% | 144 | నెలకు లాభం | 804 |
| 3. వడ్డీ | 252 | | |
| మొత్తం | 12396 | | |

## 6. ఇంధన కొరత తీర్చే బయోగ్యాస్ ప్లాంట్

వంటకు, విద్యుత్ అవసరాలకు ఈనాడు బయోగ్యాస్ మంచి ప్రజాదరణ పొందుతుంది. పశువులపేడకు నీటిని కలిపి ట్యాంకుల వంటి డ్రమ్ములలో నిలువ చేసినప్పుడు బయోగ్యాస్ విడుదలవుతుంది. దానిని గొట్టాల ద్వారా వంటగదికి,

ఇతర అవసరాలకు సరఫరా చేస్తారు. బయోగ్యాస్ ప్లాంట్ నిర్మాణానికి పెద్ద సాంకేతిక పరిజ్ఞానం అవసరంలేదు. దీనికి ముఖ్యంగా కావలసినది మంచిస్థలం. ఈ స్థలంలో తగినవిధంగా టాంక్‌ను తయారుచేసి బయోగ్యాస్‌ను నిలువచేయవచ్చు. నిర్మాణం పని ఇంటిలో కూడా చెసుకోవచ్చు. దీని వివరాలు:

| | రూ. | | రూ. |
|---|---|---|---|
| 1. స్థలం, అద్దె నెలకు | 300 | లాభనష్టాలు | |
| 2. యంత్రాలు-పరికరాలు | | 1. సంవత్సరాదాయం | 1,92,000 |
| అ) ఎలక్ట్రికల్ ఆర్క్ వెల్డింగ్ | | | |
| ట్రాన్స్‌ఫార్మర్ | 7200 | 2. ఖర్చు | 1,70,208 |
| ఆ) చేతితోనడిపే కత్తిరింపు యంత్రం | 1800 | లాభం (సం.) | 21,792 |
| ఇ) బెంచి డ్రిల్లింగ్ మెషీన్(12మి.మీ | | | |
| సామర్థ్యం. 0.5 హెచ్.పి.మోటార్) | 3000 | ఇతర ఖర్చులు | |
| ఈ) ఫ్లెక్సిబుల్ షాఫ్ట్ గ్రైండర్ | | 1. స్టేషనరీ, పోస్టేజీ | 30 |
| (150మి.మి వ్యాసంవున్న చక్రంతో) | 2400 | 2. విద్యుత్తు,ఇంధనం | 90 |
| ఉ) చేతి పనిముట్లు | 1200 | 3. ప్రయాణం | 60 |
| ఊ) ఆఫీసు ఫర్నిచర్ | 600 | 4. అద్దె మొ. | 300 |
| మొత్తం | 16200 | మొత్తం | 480 |
| 3. మళ్లీమళ్ళీ అయ్యేఖర్చు | | తయారీ ఖర్చు | |
| (రికరింగ్)ముడివస్తువులు(నెలకు) | | | |
| అ) ఎం.ఎస్.షీట్ (10s.w.d.) | 7200 | 1. వర్కింగ్ కాపిటల్ | 13800 |
| M.S.ప్లేట్ (6మి.మీ మందం) | | (నెలకు) | |
| ఆ) ఇటుకలు,సిమెంట్,ఇసుక, | | 2. యంత్రాల విలువ | |
| వెల్డింగ్,ఎలెక్ట్రోడ్‌లు,వాల్వులు మొ. | 4320 | తరుగుదల10% | 132 |
| మొత్తం | 11520 | 3. వడ్డీ 10% | 252 |
| జీతాలు-ఖర్చులు (నెలకు) | | మొత్తం | 14,184 |
| 1. సూపర్‌వైజర్ | 600 | ఆదాయం సం.నికి | |
| 2. టెక్నీషియన్ | 600 | 20 బయోగ్యాస్ | |
| 3. పనివాళ్ళు ఇద్దరికి కలిపి | 600 | ప్లాంట్‌ల అమ్మకంపై | 1,92,000 |
| మొత్తం | 1800 | (ఒక్కొక్కటి 9600 | |
| వర్కింగ్ కాపిటల్(నెలకు) | | చొప్పున) | |
| 1. ముడిసరుకులు | 11520 | | |
| 2. జీతాలు వగైరా | 1800 | | |
| 3. ఇతర ఖర్చులు | 480 | | |
| మొత్తం | 13800 | | |

## 7. ఆదాయాన్నిచ్చే పట్టు పరిశ్రమ

సిరికల్చర్ డిపార్ట్‌మెంట్‌వారి సలహా సహకారాలతో ఈ పరిశ్రమను అద్దు

తంగా నిర్వహించవచ్చు. సెంట్రల్ సిల్క్ బోర్డ్, గాంధీమాన్షన్, బెంగుళూరు అనే అడ్రస్‌కు రాస్తే ఈ పరిశ్రమ తాలూకు పూర్తి వివరాలు లభిస్తాయి.

ఈ పరిశ్రమకు దొరికే రుణాలు :

1. సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకం (ఐ.ఆర్.డి.పి) కింద ఎకరాకు దాదాపు **15వేల రూపాయలు;** మూడువేలకుపైన సబ్సిడీ లభిస్తాయి. షెడ్యూల్డ్ కులాలు, జాతులవారికి అయిదువేలదాకా సబ్సిడీ ఇస్తారు.
2. పట్టుదారం తీసే రాట్నానికి (రీలింగ్ చర్ఖా) అయిదువేల రుణం, పది శాతం సబ్సిడీతో ఏడువేల రూపాయలు పెట్టుబడి (వర్కింగ్ కాపిటల్) కింద అప్పుగా ఇస్తారు.
3. ఇది ప్రపంచ బ్యాంక్ వారి సహాయం పొందుతున్న పథకం. గ్రామాలలోని నిరుద్యోగులకు మంచి పథకం. వీటికి సంబంధించిన శిక్షణకు ఐ.ఆర్.డి.పి వారు ఇస్తారు. ఇందులో పెట్టుబడి లేకుండానే సంవత్సరానికి ఎకరానికి రెండువేలనుండి ముప్పైవేల రూపాయలదాకా లాభం సంపాదించే అవకాశం ఉంది.

## 8. పౌష్టికాహారం ప్రసాదించే కోళ్ళ పరిశ్రమ

కోడిగుడ్లు మంచి విలువైన ఆహారంగా, పుష్టినిచ్చే ఆహారంగా అందరూ గుర్తించారు. చవకగా అన్ని ఖనిజలవణాలు, విటమిన్‌లు అందించే గుడ్లను కోళ్ళ పెంపకం ద్వారా పొందవచ్చు. ప్రస్తుతం కోళ్ళ ఫారాలు లాభసాటిగానే వున్నాయి. గుడ్లధరలు స్థిరంగా వుండడం, ఎగుమతి అవకాశాలు వుండడం ఇందుకు కారణాలు. ఈ పథకం స్థానికంగా భూమి, షెడ్ ధరలలో తేడాలవల్ల ఒక్కోసారి కొంచెం అటూఇటూ కావచ్చు. అంచేత కొంచెం జాగ్రత్త పడాలి. పదివేల కోళ్ళు పెంచాలనుకుంటే దానికి కావల్సిన వివరాలు ఈవిధంగా వుంటాయి.

| *1. భూమి, భవనాలు* | రూ.లలో |
|---|---|
| 1. ఎకరం ధర (పట్టణాలలో) | 1,20,000 |
| 2. బోరింగ్, నీళ్ళట్యాంక్ | 21,600 |
| 3. లెవెలింగ్ వగైరా | 6,000 |
| 4. బ్రీడర్ షెడ్ 30X160 అడుగులు | 1,85,320 |
| 5. లేయర్ షెడ్ 30X160 | 3,24,000 |
| 6. అదనపు నిర్మాణం | 33,600 |
| *2. పరికరాలు (5000 పిల్లలకు)* | |
| 1. 250 వాట్స్ బల్బులు | 250 |
| (ఒక్కొక్కటి 180 రూ.) | 4500 |
| 2. 2 అ. వెడల్పు, 30 అడుగుల పొడవు | |

| | |
|---|---|
| ఉన్న కార్డ్‌బోర్డ్ | 1200 |
| 3. ఫీడర్స్ (ప్రతి 100 పిల్లలకు 336) | 3960 |
| 4. వాటర్స్ 100 పిల్లలకు 2 చొప్పున | |
| 110+10 (అదనంగా) మొత్తం | 120 |
| ఒక్కొక్కదానికి 18 రూ. | 1980 |
| 5. పెద్ద వాటర్స్ | 7920 |
| 6. గ్రోవర్ ఫీడర్స్ పెద్దవి ఒక్కొక్కటి రూ. 252 | 13860 |
| 7. కేజ్ సిస్టమ్-ఒక కోడికి 24 రూ. చొప్పున | 2,40,000 |
| 8. ఫీడింగ్ మిల్ 2టన్నుల్ని గంటకు | |
| కలిపేది, కరెంట్ ఖర్చుతో పాటు | 36,000 |
| 9. ఇతర ఖర్చులు | 12,000 |
| మొత్తం | 2,85,420 |

**వర్కింగ్ కాపిటల్:-**

| | రూ.లలో |
|---|---|
| 1. కోడిపిల్లలు పదివేలు, అదనంగా అయిదువందలు (మొత్తం 10,500) | 1,00,800 |
| 2. 8 వారాలకు ఒక్కోదానికి దాణా 2కి. చొప్పున 10,500 కిలోలు | 69,000 |
| 3. 9-22 వారాలవరకు దాణాఖర్చు | 1,96,800 |
| 4. టీకాలు | 37,800 |
| 5. కూలీలు, సూపర్‌వైజర్‌లు (నెలకు) | 32,400 |
| 6. 23 వారాలనుంచి 72 వారాలు దాణా ఖర్చు | 9,47,496 |
| 7. ఇతర ఖర్చు | 12,000 |
| మొత్తం | 13,90,296 |

(అంటే దాదాపు పద్నాలుగు లక్షలు)

**ఇతర ఖర్చులు:**

| | |
|---|---|
| 1. వడ్డీ సం.నికి 12 $\frac{1}{2}$ శాతం | 94826 |
| 2. తరుగుదలశాతం 18 శాతం (భవనం) | 14070 |
| 3. వస్తువులపై తరుగుదల 20% (18 నెలలకు) | 62306 |
| మొత్తం | 1,71,202 |

**ఆదాయం:**

| | |
|---|---|
| 1. కోడిగ్రుడ్లు (కనీసం 1 రూపాయి అనుకుంటే) దాదాపు | 25,00,000 |
| 2. కోళ్లను గుడ్లుపెట్టిన తర్వాత అమ్మితే ఆదాయం | 2,05,200 |
| 3. ఎరువులు, ఇతర ఆదాయం | 43,530 |
| మొత్తం | 27,48,730 |

ఆదాయం 27,48,730

ఖర్చు 15,61,500

లాభం 11,87, 230

ఈ లాభం ఈ విధంగా వుండాలంటే కోళ్లఫారం ఒక సంవత్సరం పెట్టి తీసేయకుండా కనీసం 10-15 సంవత్సరాలు పెట్టాలి. అప్పుడే ఖర్చు తగ్గి లాభం పెరుగుతుంది. ఒకసారి నిర్మించిన షెడ్, కేజ్ శాశ్వతంగా పనికొస్తాయి. అందువల్ల మూలధనంలో తేడావచ్చి లాభాలు పెరుగుతాయి.

దీనికి తోడు బ్రాయిలర్ కోళ్లను పెంచితే ఆదాయ వివరాలు ఇలా వుంటాయి. బ్రాయిలర్స్ 6 బ్యాచ్‌లు సంవత్సరానికి 48000 పెంచితే

| | |
|---|---|
| 1. భవనం | 3,52,800 |
| 2. పరికరాలు | 57,600 |
| 3. 8400 బ్రాయిలర్స్ | 61,200 |
| 4. దాణా 16వేల కిలోలు | 57,600 |
| 5. కరెంటు, మందులు, కూలీలు వగైరా | 24,000 |
| మొత్తం | 5,52,480 |

| మళ్లీమళ్లీవచ్చే ఖర్చులు:- | రూ.లలో |
|---|---|
| 1. 50,400 బ్రాయిలర్స్‌కు | 3,62,880 |
| 2. దాణా | 6,64,848 |
| 3. మందులు, విద్యుత్, కూలీలు | 1,02,960 |
| 4. నెలకు 1200 రూ. చొప్పున సంవత్సరానికి ఇతర ఖర్చులు | 14,400 |
| మొత్తం | 11,45,088 |

ఆదాయం

| | |
|---|---|
| 1. 48,000 బ్రాయిలర్స్ 1.5 కిలోలు సగటున కిలో 20రూ. చొప్పున | 14,40,000 |
| 2. దాణా తెచ్చిన ఖాళీ సంచులు దాదాపు 2000 (ఒక్కొక్కటి రూ. 4.50) | 7,200 |
| 3. ఎరువు | 11,400 |
| మొత్తం | 14,58,600 |

బ్రాయిలర్‌కోళ్లకు మంచి దాణా పెడితే, ఒక్కో కోడి బరువు 2 కిలోల దాకా వుంటుంది. మంచి లాభాలు వస్తాయి. ఇందుకు మార్కెట్ పరిస్థితుల పరిశీలన చాలా అవసరం.

## 9. కోళ్లదాణా, పశువుల దాణా (మేత)

స్వంత ఆవరణలో కోళ్లదాణా, పశువులదాణాకు పనికివచ్చే ఖనిజ మిశ్రమం

తయారీకి పూనుకోవచ్చు. ఇందుకు దాదాపు 1000 చదరపు మీటర్ల భూమి కావాలి. ఫ్యాక్టరీ షెడ్, ఆఫీస్‌కోసం 120 చదరపు మీటర్ల స్థలం కావాలి. ఖనిజ మిశ్రమం తయారీకి పెద్దగా శ్రమ పడవలసిన అవసరంలేదు. అవసరమైన ముడిపదార్థాలను సరైన పాళ్లలో కలపడం మాత్రమే ఇందులో కీలకమైనదశ. కాల్సైట్, డైకాల్షియం ఫాస్ఫేట్, అయోడిన్, రెడ్‌ఆక్సైడ్, మేంగనీస్ సల్ఫేట్, జింక్ సల్ఫేట్ మొదలైన ముడిపదార్థాలు ఉత్తరప్రదేశ్, తమిళనాడులలోనూ, మనరాష్ట్రంలోని కర్నూలుజిల్లాలోనూ ఎక్కువగా దొరుకుతాయి.

| ఇందుకు కావలసిన యంత్రాలు : | | రూ. లలో . |
|---|---|---|
| 1. 900 లీటర్ల సామర్థ్యం వున్న రిబ్బన్ బ్లెండర్, 7.5 హెచ్.పి. మోటర్ గేర్‌బాక్స్ ఎలివేటర్ | | 98040 |
| 2. బ్యాగ్ క్లోజర్ (సంచీలు మూసే పరికరం) | | 4800 |
| 3. 300 కిలోల బరువు తూచే యంత్రం (తులమాన్ ప్లాట్‌ఫారం వేయింగ్ స్కేల్) | | 4800 |
| 4. 1 కిలో వరకు తూచే త్రాసు (తులామాన్ 1కిలో పోర్టబుల్ వేయింగ్ స్కేల్) | | 4800 |
| 5. స్క్రూ కన్వేయర్ | | 2400 |
| 6. విద్యుదీకరణ, యంత్రాల స్థాపన | 7200 | |
| | మొత్తం | 1,22,040 |

పనివారు : ఇద్దరు నిపుణత కలవారు, ఎనిమిది మంది మామూలు పని వాళ్లు కావాలి

| ప్రాజెక్ట్ విలువ | | రూ. లలో |
|---|---|---|
| 1. భూమి, భవనాలు : | | |
| అ) భూమి 1000 చ.మీ | | 18,000 |
| ఆ) భవనాలు (బోర్‌వెల్, పారిశుద్ధ్య ఏర్పాటుతో) | | 1,20,000 |
| ఇ) ప్లాంట్, యంత్రాలు | | 1,22,040 |
| ఈ) స్థాపన | | 6,000 |
| ఉ) తొలిదశ ఖర్చు | | 24,000 |
| ఊ) నిర్వహణ పెట్టుబడి వాటా | | 51,960 |
| ఎ) చిల్లర ఆస్తులు | | 6,000 |
| | మొత్తం | 3,48,000 |

**పెట్టుబడి పద్ధతి :**

| | |
|---|---|
| 1. స్థాపకుల వాటా | 87,500 |
| 2. APSFC నుండి టర్మ్‌లోన్ | 2,61,000 |
| మొత్తం | 3,48,500 |

అప్పు, పెట్టుబడి నిష్పత్తి 3 : 1

స్థిరాస్తులలో వ్యవస్థాపకుల పెట్టుబడి 10శాతం మాత్రమే.

ఈ యూనిట్‌ను ప్రారంభించే వారికి మంచి విషయ పరిజ్ఞానం, దాణా తయారీదారులతో సహకారధోరణి అవసరం.

## 10. నూనె మిల్లు

వేరుశెనగ గింజల నుండి నూనె తీసేందుకు ఈ పథకం ఉపయోగపడుతుంది. ఇందులో వేరుశెనగ గింజల పొట్టు తీయడం, వేరుచేసిన గింజలను వేడిచేసి నూనె తీయడం, వడకట్టిన నూనెను డబ్బాలలో నింపడం ముఖ్యమైన దశలు. గంటకు 480 కిలోల నూనె గింజల పనిపట్టించగల ఈ పథకం వివరాలు ఈ విధంగా వుంటాయి.

భూమి, భవనాలు : అర ఎకరం భూమి, 1500 చ. అడుగుల భవనం అవసరం. వీటి ఖరీదు దాదాపు రెండు లక్షల రూపాయలు ఉండవచ్చు.

ముడిసరుకు : వేరుశెనగ గింజలు, మనరాష్ట్రంలో చాలా చోట్ల వేరుశెనగను పండిస్తారు.

విద్యుత్తు : 60 హెచ్.పి. విద్యుత్తు ఈ పరిశ్రమకు అవసరం

పనివారు : పదిమంది నిపుణులు, సాధారణ పనివారు కావాలి.

| యంత్రసామాగ్రి : | రూ. |
|---|---|
| 1. 50 హెచ్.పి. నూనె తీసే యంత్రం(గంటకు 480కి.గ్రా.) | 1,20,000 |
| 2. ఫిల్టర్ ప్రెస్ | 36,000 |
| 3. మినీబాయిలర్ | 21,600 |
| 4. 50 హెచ్.పి., 10 హెచ్.పి. మోటార్‌లు, దానికి సంబంధించిన సామాగ్రి | 1,00,400 |

| ప్రాజెక్టు ఖరీదు: | |
|---|---|
| 1. భూమి | 6,000 |
| 2. భవనాలు | 2,64,000 |
| 3. యంత్రసామాగ్రి | 2,88,000 |
| 4. ఇతరాలు | 12,000 |
| 5. తొలిఖర్చులు | 30,000 |
| 6. నిర్వహణ పెట్టుబడి వాటా | 96,000 |
| మొత్తము | 7,50,000 |

| పెట్టుబడి విధానం : | |
|---|---|
| 1. స్వంత పెట్టుబడి | 1,87,500 |

